# గ్రంథాలయసర్వస్వము.

ప్రతిమాసమునను సచిత్రముగ వెలువడును



సంపు. ౮ ] బెజవాడ [ సంచిక ౧

నవంబరు ౧౯౩౫

సంపాదకుడు: అయ్యంకి వేంకటరమణయ్య

## ఊటుకూరి వెంకటసుబ్బరాయశ్రేష్ఠిగారి

# స్మారకసంచిక




వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును
ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును
సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో అట్లే
జ్ఞానముకూడ సౌఖ్యప్రదము కావలయును

చిలకమర్తి లక్ష్మీనరసింహము

వార్షికమూల్యము: సభ్యులకు రు ౩

ఇతరులకు రు ౪ విడిసంచిక పావలా

# బెజవాడ సరస్వతీ బుక్ డిపోవారి స్వంత ప్రచురణములు

## ఆంధ్రదేశమున ప్రదర్శింపబడు నాటకములు.

| | రు. | అ. |
|---|---|---|
| సతీ సక్కుబాయి సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము ము॥ సు॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 0 |
| బుద్ధిమతీవిలాసము డిటో | 1 | 0 |
| రంగూన్‌రౌడీ సో॥ రా॥ | 1 | 0 |
| ధరణికోట డిటో | 1 | 4 |
| సతీ అనసూయ డిటో | 1 | 0 |
| గంగావతరణము డిటో | 1 | 0 |
| మహాభక్తవిజయము డిటో | 1 | 0 |
| ద్రౌపదీవస్త్రాపహరణము మ॥ అ॥ | 1 | 0 |
| సావిత్రి శ్రీ॥ స॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| పత్నీప్రతాప్ అను అనసూయ సో॥అ॥ | 1 | 0 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకము పా॥ ల॥ | 1 | 4 |
| జయంతజయపాలము ఆ॥ స॥ | 0 | 12 |
| కృష్ణలీల బళ్లారి కె॥ సు॥ | 1 | 4 |
| రామదాసు డి॥ గో॥ | 1 | 0 |
| రసపుత్రవిజయం ఇ॥ యు॥ | 1 | 0 |
| రాణాప్రతాప్‌సింగు డిటో | 1 | 0 |
| చంద్రగుప్త సం॥ శి॥ | 1 | 0 |
| దుర్గాదాసు జం॥ శి॥ | 1 | 4 |
| రాణాప్రతాపసింహ డిటో | 1 | 0 |
| రాధాకృష్ణ సాంగ్సు చం॥ కే॥ | 0 | 12 |
| తులాభారంసాంగ్సు డిటో | 0 | 12 |
| చండిక నాటకం ము॥ వే॥ | 1 | 0 |

## ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు.

| | రు. | అ. |
|---|---|---|
| జానకీశపథము | 1 | 0 |
| రుక్మిణీకళ్యాణము | 0 | 12 |
| మార్కండేయ చరిత్రము | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| అంబరీష చరిత్రము | 0 | 8 |
| ప్రహ్లాద చరిత్రము | 0 | 8 |
| గజేంద్రమోక్షము | 0 | 8 |
| భీష్మచరిత్రము | 0 | 8 |
| పైన ఉదాహరించిన 8 పుస్తకములు కలిసిన క్యాలికో బైండు | 5 | 8 |

## బి. బాలాజీదాసుగారిహరికథలు.

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానము | 0 | 8 |
| జయప్రదాదేవిచరిత్ర | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 |
| రుక్మాంగదచరిత్రము | 0 | 8 |
| కుశలవవిజయము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| దయాకరవిజయము | 0 | 8 |
| త్రైశంకువిజయము | 0 | 8 |
| సీతాకళ్యాణము | 0 | 8 |
| ద్రౌపదీమానసంరక్షణము | 0 | 6 |
| కుచేలోపాఖ్యానము | 0 | 6 |
| పురందరదాసు చరిత్ర | 0 | 6 |
| హరికథేతిహాసమంజరి పా 1 | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |

మావద్ద అనేకరకములు గలవు. కోరినవారికి నూరుపేజీల కేట్లాగు ఉచితముగా పంపబడును.

దొరుకువారు:—కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్‌డిపో, బెజవాడ.




పరబ్రహ్మాత్మికాం దేవీం భుక్తిముక్తి ఫలప్రదాం,
ప్రణమ్య నౌమి తా మేవ జ్ఞానశక్తిం సరస్వతీమ్.

౯-వ సంపుటము.

# గ్రంథాలయసర్వస్వము.

౮-వ సంచిక.

నవంబరు 1935


## పిలుపు

[ గీతిక ]

కవికొండల వేంకటరావు

ఇచ్ఛ గలుగకుండఁజేసి
స్వేచ్ఛ గొలుపు మెడఁద దేవ!
ఎట్టి పేరు వలదు నాకు
గట్టిగొంతు కెత్తి పిలువు:
ప్రాపుగాకు రూప మిచ్చి
రా! ఐక్యత నమృతముగ

నిన్నుఁ బూజ సేతు నోయి
నిన్నుఁ బూజ వ్రాతునోయి
పలుకవేమి ? పాడవేమి ?
ప్రకటనమ్ము సేయవేమి ?
పలుకమందు నన్ను నీవు
పాడమందు నన్ను నీవు:
బహిరంగము సేతు నన్ను
వలదు వలదు వలదు దేవ!
నిన్ను పూజ మూతు నోయి
నిన్ను పూజ దాతు నోయి
పలుకు మోయి! పాడు మోయి!
ప్రకటనమ్ము సేయు మోయి!

అంతరిక్ష మంద లేను
అచటిరిక్క అక్షి మూయు;
కాలగర్భఖనన మేమొ
కనుపు తెఱుగుఁ గటికమిత్తి;
కళ్ల నీళ్లు గార్చునపుడు
తెల్లవాఱినట్లు దోఁచు;
పగటివేళ భానుఁడున్న
అంధకారబంధురమ్ము;
వీణవాణి వ్రేళ్లు మీటి
గానమీను గడియలందు
మానమన్న మనసు గలఁగు
జ్ఞానశాంతిశ్రద్ధ మేల?




# గ్రంథాలయ సర్వస్వము.

## యువ

పొన్నాడ కృష్ణమూర్తి

గుబురొత్తన్న తియ్యమామిడి గున్న యమరిన గ్రంథాలయమ్ము గాఁగ
గాలిచే నూఁగిసి చక్కఁగఁజేరి వీచుచుఁ బరగు శాఖలు బీరువాలుగాఁగ
చెలువొందు కళఁజిందు చిగురాకుజొంపముల్ సమకూర్పఁబడు గ్రంథసమితి గాఁగ
అతిమనోహరలీల సమవొంది విడివడి రాలుపత్రములు పత్రములుగాఁగ
యువ మనోహరకలసినదోక్తిఁ గంఠమెత్తి 'కో' యని కూయుచు నెలమినెంచు
యువపికమ్ములు పాఠకప్రవరులుగ ధరాస్థలిని మించె నన రాదురక్తి మీరు

---

## భాషోద్ధారక
## ఓటుకూరి వేంకట సుబ్బరాయశ్రేష్ఠి

ధనమా యున్నది, దానమా కలదు, విద్యా మంచిమార్గంబులన్
బనిసాగించెను, నెందఱెందఱొ మహోపన్యాసముల్ జేసి వే
డ్క నుతుల్ సల్పఁగ వేటపాలెపుమహాగ్రంథాలయం బెన్న మే
దిని సారస్వత శ్రీనికేతనము సందేహంబు లే దేమియున్

— జనాబ్ ఉమర్ ఆలీషాకవి

### మహాపురుషుఁడు

సంఘసంస్కర్తయై, దేశాభిమానియై, భాషాపోషకుఁడై, ధనవంతుఁడై, దాతయై, ఉత్సాహవంతుఁడై, కార్యశూరుఁడునునై శ్రేష్ఠిగారు యావదాంధ్రదేశమున తమ కీర్తిలతను ప్రాకునట్లు జేసిరి. అసాధారణమైన వదాన్యత, నిరంతర కార్యదీక్ష, దీనజనసంరక్షణదక్షత, ఆసక్తి, జనసామాన్యపు టవిద్యా నిర్మూలనాసక్తి; అందునను మన దేశమున వెనుకఁబడియున్న స్త్రీసంఘోద్ధరణప్రయత్నపరత; ఇట్టి యనేక సుగుణసంపద లుండుటచే సుబ్బరాయశ్రేష్ఠి మనకు చిరస్మరణీయు డగుచున్నారు. ఇట్టి మహాపురుషుని చరిత్ర క్లుప్తముగనైనను మనము తెలిసికొందము.

### బాల్యము

శ్రేష్ఠిగారు ౧౮౯౮ వ సంవత్సరమున నవంబరు 20 వ తేదీన జన్మించిరి. పినతండ్రియగు తాతయ్యశెట్టిగారిచే బాల్యమునందే దత్తతగై కొనబడిరి. విద్యార్థి దశయందు వేటపాలెము బాపట్లలయందు కొంత గడపి పిమ్మట కాకినాడయందలి పీఠికాపుర రాజావారి కళాశాలయందు ఉన్నత విద్యను బడసిరి. తదుపరి 1913 వ సంవత్సరమున స్వగృహముచేరి కనుపర్తి వాస్తవ్యులగు సుబ్బయ్యశ్రేష్ఠిగారి పుత్త్రికారత్నమగు కమలాంబ గారిని బరిణయంబాడిరి.

వీరికి బాల్యమునుండియు విద్యాప్రచారక సంస్థలనిన ప్రీతి మెండు కావున 1918 వ సంవత్సరమునవే కొందఱు యువకుల ప్రోత్సహించి

గ్రంథాలయ సేవక



ఊటుకూరి వెంకటసుబ్బరాయశ్రేష్ఠి

వేటపాలెమునందు 'హిందూయువజనసంఘ' మను పేర నొక గ్రంథనిలయమును స్థాపించిరి. అయ్యదియే వారికార్యసాఫల్యమునకు బ్రాతిపదిక యైనది. నాటినుండియే వారు కార్యదీక్ష వహించి గ్రంథాలయోద్యమాభిమానులై యెన్ని యడ్డంకులు వచ్చినను యావజ్జీవము తద్వ్యాపనకై ధారవోసిరి. మహాత్ములు తలపెట్టిన కార్యమున కెన్ని విఘ్నములు వచ్చినను దుదివఱకు నెరవేఱ్తురుగదా!

## సారస్వతనికేతనము

1918 వ సంవత్సరమున స్థాపించిన 'హిందూయువజన సంఘము' నకు వీరు రెండు సంవత్సరములు కోశాధిపతిగను, కార్యదర్శిగను మఱి మూడు సంవత్సరములు అధికారము వహించి దాని యభివృద్ధి కెంతయు గృషి సల్పి తన్నిర్వహణమునకు రు 500-0-0 లను తమ స్వంత ద్రవ్యమును వినియోగపఱచిరి. కాని తోడి మిత్రుల సహకారము తక్కువ యగుటంజేసి యీసంస్థ పనిచేయక నిలిచిపోవు నట్లుండగా అప్పటి పరిపాలకవర్గమువారి యనుమతి బడసి సంస్థకు సంబంధించిన యావదాస్తిని బాధ్యతలతో 1924 వ సంవత్సరమున వశపఱచుకొని దానికి "సారస్వతనికేతన" మని నూతననామకరణముం జేసి, అప్పటినుండియు, నాసంస్థకు పరిపాలకధర్మకర్తగ నుండి వ్యవహరించుచు దానిని మండలమున కంతకును మిన్నయైన గ్రంథాలయముగ జేసి శాశ్వతవిఖ్యాతిని బడసిరి.

## గ్రంథాలయమే కన్నబిడ్డ

వీరికి సంతానము లేకుండుటచే వీరు స్థాపించిన సారస్వతనికేతనమునే వీరి యభిమానపుత్రికగ నెంచుచు దీనియభివృద్ధియే తమజీవితపరమావధిగ భావించుచుండెడివారు. ఈసంస్థకు వీరి యావజ్జీవితము వినియోగించుటయేకాక రు 4500-0-0 ల ఖరీదు గల 'సుబ్రాయమహల్' అనుభవనమును దాన మొసర్చిరి.

దీని నిర్వహణమునకు కొంత మూలధనము నేర్పరచి అందు తమ స్వంతమున రు 3116 ల నొసంగి వారి వదాన్యతను వెల్లడించుకొనిరి. నికేతన నిర్వహణమునకు ప్రతిసంవత్సరమునను లోటువచ్చుచు వచ్చిన రు 4160 లను గూడ తామే భరించిరి. ఈ పై జెప్పిన సహాయమే గాక ఈ నికేతన గ్రంథాలయమునకు కొన్ని వందల గ్రంథములను వస్తుసామగ్రులనుగూడ దాన మొసర్చిరి.

## గ్రంథాలయోద్యమ సేవ

వీరు ఆంధ్ర దేశ గ్రంథాలయసంఘమున కుపాధ్యక్షులుగను, కొంతకాలము గుంటూరుమండల గ్రంథాలయసంఘమున కధ్యక్షులుగను నుండి తమ యావచ్ఛక్తిని గ్రంథాలయోద్యమవ్యాప్తికై వినియోగించి ప్రజానుమోదమును బడసిరి.

కృష్ణామండల గ్రంథాలయసభను ప్రారంభింపజేయుచును, సత్తెనపల్లి తాలూకా గ్రంథాలయసభకు అధ్యక్షత వహించియును గంభీరోపన్యాసముల నొసంగిరి. మరియు పిలిచిన చోటికెల్ల బోవుచు జిల్లాగ్రంథాలయోద్యమవ్యాప్తికి నిరంతరము పాటుబడుచుండిరి.

## సారస్వత సేవ

గ్రంథాలయోద్యమమునందే గాక వీరిపేరు ఇతరోద్యమములలోను ఖ్యాతి జెందినది. వీరు చాలకాలము ఆంధ్రభారతీతీర్థ కార్యదర్శులుగ నుండి భాషాసేవ జేయుటకై తమ యమూల్యజీవితమును వినియోగించిరి. శ్రేష్ఠిగారు భాషాసేవ చేయుట కేవలము వాక్పూరతచేత నేగాక

రాజులవలె కృతుల సంకీర్తనము బొందుటయు పండితులను సదా సత్కరించుటయు జూడ వీరికి గల మాతృభాషా గౌరవము గూడ వ్యక్తము గాగలదు. 'ధన్వంతరీ వైద్యలహరి' యను గ్రంథమును కృతి నంది వీరు మరింత ఖ్యాతిజెందిరనుటలో నేమియు సందేహము లేదు. వీరికి మాతృభాషాగౌరవమును, గ్రంథాలయోద్యమాభిమానమునే గాక పరిపాలనాదక్షతయు కలదు.

### పంచాయితీ అధ్యక్షులు

వీరు 1928 వ సంవత్సరమున వేటపాలెము నందలి పంచాయితీబోర్డునకు అధ్యక్షులుగ నెన్నుకొనబడి మూడుసంవత్సరముల పైకాల మద్దాని వ్యవహారములను కడుంగడు సమర్థతతో నిర్వహించి సంఘాభ్యుదయమునకును గ్రామోద్ధరణకు నత్యంతము పాటుబడిరి.

శ్రేష్ఠిగారు వేటపాలెపు వైశ్యసంఘమునకధ్యక్షులుగ నుండి కన్యకాపరమేశ్వరీ ఆలయ నిర్మాణము పూర్తి చేయించి సంఘాభ్యున్నతికై మిక్కిలి పాటుబడిరి.

### మాతృదేశాభిమానము

వీరిమాతృదేశాభిమానమునకు నిదర్శనము వీరికి కాంగ్రెసన్న మెండు ప్రీతి. చాలకాలము మండలరాష్ట్రసంఘములయందు సభ్యులుగనుండి దేశసేవ యొనర్చి ధన్యులైరి. 1920వ సంవత్సరము నుండియు వీరు ఖద్దరువస్త్రధారణావ్రతమును బూని నిరంతరము తమ దేశాభిమానము వ్యక్తపఱచిరి.

### విద్యాదానము

నిరంతరము విద్యాదానము జేయుటే వీరిజీవిత పరమావధియన నతిశయోక్తి యేమియు లేదు. బీదవిద్యార్థులను వీరు తండ్రివలె సాకిరి. వీరి సహాయప్రోత్సాహములను బడసిన ఇలిందరు రంగనాయకులను విద్యార్థి మొన్న మొన్న నే యం. ఏ. పరీక్షయందు ప్రథమతరగతియందు ప్రథములుగ నుత్తీర్ణులైనందులకు వారిని గౌరవించుటకు సభను గూడ జరిపించిరి.

"........శ్రేష్ఠిగారు కార్యోత్సాహమును సంకల్పదీక్షయు, మాతృభాషారాధనదృష్టియు గల యువకుడు......................" అని వీరినిగూర్చి రాయప్రోలు సుబ్బారావుగారు రభిప్రాయ మిచ్చియున్నారు. శ్రేష్ఠిగారు స్థాపించిన "సారస్వతనికేతనము"ను గూర్చి చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు: "వేటపాలెమునకు చుట్టుప్రక్కల నున్న గ్రామములకు నిది నిజముగా నొక కల్పవృక్ష మని చెప్పవచ్చును." అని చెప్పిరి. శ్రేష్ఠిగారి కార్యదీక్షాఫలమగు నికేతనోపయోగమును పురుషపుంగవులే గాక స్త్రీ రత్నములు గూడ కడుంగడు శ్లాఘించిరి. గ్రంథాలయమును గూర్చి శ్రీమతి కొండ పార్వతీదేవిగారు "......దీనివలన స్త్రీలుకూడ మిక్కిలిలాభమును బొందుచున్నారు ......" అనియు; శ్రీమతి పులవర్తి కమలావతీదేవి కవయిత్రిగారు "........ఇయ్యది సకలకళాసంపత్ప్రభూతమగు విద్యాక్షేత్రము యొప్పుచున్నది......" అనియు తమ యమూల్యాభిప్రాయముల నిచ్చియున్నారు.

శ్రేష్ఠిగారు వీని యన్నింటికిదోడు సంఘ సంస్కరణాభిలాషి. బాలవితంతూద్వాహములను ప్రోత్సహించుచు కడుంగడు సంఘసంస్కారమును గావించి ధన్యులైరి.

వీరు కొంతకాలముక్రిందనే మరణ శాసన మొకటి వ్రాసిరి. అందులో శ్రీ సారస్వత నికేతనమునకు మరికొంత భూవసతి నేర్పరచుచు

నికేతన భవనాభివృద్ధికిని, నికేతన పరిపాలన కునుగూడ జక్కని యేర్పాటులు గావించిరి.

ఈ విధముగ నిరాడంబరుడై, భాషాపోషకుడై, దేశసేవా పరతంత్రుడై, సంఘసంస్కార ప్రియుడై, సదా ఉన్నతాశయ ప్రేరితుడై యావజ్జీవము విజ్ఞానవ్యాప్తికే ధారవోసి, శక్తి, ధనము, సర్వస్వము గ్రంథాలయోద్యమమున కర్పించి యత్యంత ఆదర్శప్రాయముగ పని చేసిన యిట్టి పరమపూతచరిత్రుడు - శ్రేష్ఠివర్యుడు మనల నందరను దుఃఖసాగరమున ముంచి యుల్ప ప్రాయమునందే 1935 సంవత్సరము మే 6-వ తారీఖున ఉదయము దైవసాన్నిధ్యము నందుట కెంతయు విచారింపవలసియున్నది. భగవంతుడు వీరి యాత్మకు శాంతి చేకూర్చుగాత.

విల్లునామా

శ్రీ శ్రేష్ఠిగారు తాము చనిపోవుటకు పూర్వము వ్రాసిన విల్లునుండి ఈ క్రింది భాగములను ప్రచురించుచున్నాము:

ఆన 1935 వ సంవత్సరము మార్చినెల 30 ముప్పదియవ తారీఖున గుంటూరుడిస్ట్రిక్టు చీరాల సబ్ డిస్ట్రిక్టు వేటపాలెము గ్రామకాపురస్థుడు, వైశ్యులు, భూస్థితివగైరా వూటుకూరు తాతయ్యశెట్టిగారు దత్తుకుమారుడు వూ. వెం. శ్రేష్ఠి వ్రాయించిన విల్లు.

నాకు యిప్పటికి షుమారు 41 సంవత్సరముల వయస్సు గలదు. నాకు పుత్రపుత్రికాసంతానము లేదు. నాకు షుమారు 31 సంవత్సరముల వయస్సు గల వూటుకూరు కమలాంబ యను పేరు గల భార్యమాత్రము గలదు. నాకు ఇప్పటికి షుమారు 15 దినములనుండియు గుండెవ్యాధి కనుపించుచున్నందున యీవ్యాధి నమ్మదగినది కాదను అధైర్యము తోచి నాతదనంతరము నా యాపదాస్తియు యీక్రిందివిధముగా వినియోగపడునట్లు యేర్పాటు చేసినాను.

1918 వ సంవత్సరములో స్థాపింపబడి తదాది యీరోజువరకు పెంపు చేయబడి నాచే పరిపాలింపబడుచున్న వేటపాలెములోని శ్రీసారస్వతనికేతనమును సంస్థకు నేను పెట్టిన పెట్టుబడిబాపతు నాకు రావలసియుండు బాకీమొత్తమును నాభార్య రద్దుపరచి వసూలుచేయుగూడదు. యీసారస్వతనికేతనముతాలూకు నాపేర్న వడ్డీకిగాను ఉన్న మూలధనము నేను చెల్లించవలసియుండి అందులకుగాను కొంత మొత్తమునకు నాతాలూకు ఓరియంటలు గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్ లోని నెం248609రు గల రు 3000/- ల పాలసీని నిన్నటిదినమే శ్రీసారస్వతనికేతనము పేరటికి assign చేసియున్నాను. యీపాలసీమీద వసూలగు మొత్తము పోను నిల్వబాకీ మొత్తమునకు నాతాలూకు పాతరెడ్డిపాలెము గ్రామములోని 1927 నెంబరు పట్టాదాఖలా రు 30-14-0 లు శిస్తుగల డి. నె. 746/4, 745/5, 743/4, 746/12 లు గల ఎ 3-40లు మూడుయకరముల నలుబదిసెంట్లు శేరీ మాగాణి భూమిని రు 3000/- మూడువేల రూపాయీలకు సారస్వతనికేతనము పేర విక్రయదస్తావేజు వ్రాయించి నాభార్య రిజిస్టరు చేయించి యివ్వవలయును. యీపై రెండు మొత్తములు చెల్లులు పోగా యింకను యివ్వవలసియుండు మొత్తమును నా Estate లోనుండి నాభార్య చెల్లించవలయును. నావగైరాల పేరుతో నె 22 పట్టాగల గొనసపూడిగ్రామములోని నాతాలూకు య3-0 మూడుయకరముల శేరీమాగాణి మెరకభూములను నేను సంతోషపూర్వకముగా సారస్వతనికేతనమునకు దానము చేయుచున్నాను. యీ దాన

మునకు వలయు పత్రిమును నాభార్య వ్రాయించి రిజిష్టరు చేయించి యివ్వవలయును.

యీ సారస్వత నికేతన మందిరమగు సుబ్రాయ మహల్ అను భవనమును పక్కా కట్టడముగా చేయవలయునను తలంపుతో తూర్పు పడమర గోడలు కట్టించియున్నాను. మిగిలిన గోడల కట్టుబడి, రూఫింగు, ఫ్లోరింగు సామానులను నా ఎస్టేటునుండి నాభార్య పూర్తి చేయించవలయును. యీ సారస్వతనికేతనమునకు నా భార్య నావలెనే ఆదరాభిమానములు చూపుచూ సహాయము చేయుచుండవలయును. యీ సారస్వత నికేతనము పరిపాలనను నా జనకసోదరుని కుమారుడగు పూటుకూరు జయరామదాసు నాస్థానే ధర్మకర్తగా యుండి సక్రమముగా నిర్వహించుచుండవలయును.

ఇప్పటికి చాలా సంవత్సరముల నుండియు మాయింట్లోనే యుంటూ మాకు చాలా సహాయభూతురాలుగా యుంటూయున్న నావదినెగారగు బొమ్మిశెట్టి సుబ్బారావుగారిభార్య మహాలక్ష్మమ్మగారు తన జీవితపర్యంతమును నా తాలూకు పెదగంజాం గ్రామములోని నె 84 రు పట్టా దాఖలా య 1-78 ఒక యకరం డెబ్బదియెనిమిది సెంట్లు శేరి మాగాణిభూమిని స్వాధీనపరచుకొని అందలిఫలసాయమునుమాత్రము అనుభవించవలయును. ఆమె తదనంతరము యీ భూమిని సారస్వత నికేతనమువారు స్వాధీనపరుచుకొని సంపూర్ణహక్కులను కలిగియుండవలయును.

నాకు పబ్లికువర్క్సు డిపార్టుమెంటులోనున్నూ లోకలుఫండు డిపార్టుమెంటులోనున్నూ నేను చేయుచున్న కంట్రాక్టుపనుల తాలూకున్నూ, డిపాజిట్లు తాలూకున్నూ రావలసిన మొత్తములను నాభార్యయే వసూలుపరచుకొని తన యిష్టప్రకారము అనుభవించవలయును. నాకు లోకులవల్ల రావలసిన డిక్రీలు, దస్తావేజుల బాపతున్నూ నా లెఖ్ఖ పుస్తకముల బాపతున్నూ బాకీలను నా భార్యయే సంపూర్ణహక్కులు గలిగి వసూలు పరచుకొనవలయును. నేను హిందూ మ్యూచుయల్ లైఫ్ అస్యూరెన్సు లిమిటెడ్ నె 2393రు పాలసీలో రు2000/- లకు జీవితమును భీమాచేసియుండి ఆ పాలసీలో నా భార్యను నామినీగా యిదివరకే వ్రాసియున్నాను. యీ మొత్తమును నా భార్యయే వసూలుపరచుకొని అనుభవించవలయును. నాకు ఓరియంటలు గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్‌లో నె 191946 రున రు 3000/—లున్నూ భారత యిన్సూరెన్సుకంపెనీ లిమిటెడ్‌లో నె 69821 న రు 1000/—లకు పాలసీలు గలవు. యీ రెండు పాలసీలున్నూ నిన్నటిదినమే నా భార్యపేర assign చేసియున్నాను. యీ రెండుపాలసీల మొత్తమున్నూ నా భార్యయే వసూలుపరచుకొని అనుభవించవలయును. నా లెఖ్ఖ పుస్తకముల దాఖలా నేను లోకులకు యివ్వవలసియుండు బాకీలను నా Estate నుండి నా భార్య తీర్చవలయును.

నాకు స్వర్ణ, కొడవలివారిపాలెం, సంతరావూరు, గొనసపూడి, యింకొల్లు, కనుపర్తి, వేటపాలెం, పుల్లరిపాలెం, నాయునిపల్లి గ్రామములలో యిండ్లు, స్థలములు, కొట్లు, దొడ్లు, మాగాణిమెరక భూములు, చవుకుతోటలు, వుప్పువాములు వగైరా స్థిరాస్తిగలదు. యీస్థిరాస్తికిని, నా తాలూకు యితర స్థిరచరాస్తులకున్ను నాభార్యయే హక్కు గలిగి స్వాధీనపర్చుకొని తనయిష్టప్రకారం దానాదమన విక్రయాది సంపూర్ణహక్కులతోను అనుభవించవలయును. నాభార్యజీవితా

## సారస్వతనికేతనభవనము, వేటపాలెము.



సుబ్రాయమహల్.

J1128

# సారస్వతనికేతనము, వేటపాలెము.



గ్రంథాలయాంతర్భాగము.



పఠనమందిరము.



గ్రంథాలయాంతర్భాగము.



భజనమందిరము.

నంతరము నిల్వయుండు యావత్తు స్థిరచరాస్తులున్న సారస్వతనికేతనమునకు చెందవలయును. యీవిల్లు నేను మంచివ్యక్తిలోనుండి, దృఢమనస్సుతో వ్రాయించితిని. యేకారణముచేత నయినను యీవిల్లును మార్చవలసి వచ్చినను రద్దుపరచవలసివచ్చినను అట్లు చేయుటకు నాకు అధికారము గలదు. యిది నాసమ్మతిని వ్రాయించిన విల్లు.

---

# సారస్వత నికేతనము, వేటపాలెము.

పూర్వచరిత్ర:—

1918 సంవత్సరము అక్టోబరు 15 వ తేదీన ఈ గ్రామములోని కొందరు యువకులయొక్క తోడ్పాటుతో "హిందూయువజనసంఘ" మను పేర కీ. శే. ఊ. వేం. శాస్త్రిగారు దీనిని స్థాపించిరి. దీనికి అప్పటిలో స్వంతభవనము లేకుంటచే నొక చిన్నయింటిని బాడుగకు గైకొని దానిలో నుంచి సభ్యులవలన వసూలగుస్వల్ప చందాలచేతను వివాహాది శుభకార్యములందు వసూలగు స్వల్పవిరాళములవల్లను దీనిని పోషించుచు దీనియొక్క ప్రయోజనము కొలది మంది సభ్యులకు మాత్రమే కలిగింపబడుచుండెను.

అయిదు సంవత్సరములు నిండియు నిండక పూర్వమే సభ్యులసంఖ్య తగ్గుటయు, చందాలు వసూలు కాకుంటయు తటస్థించి సంఘవ్యవహారములు చక్కగా కొనసాగుటకు వలను పడక అనేక అంతరాయములు కలుగుచు తుదకు సంఘమును మూసివేయవలసినంత దుర్గతి పట్టుటచే శ్రీ శాస్త్రిగారు ది 12-8-1923 న సంఘసభ్యులను సమావేశపరచి దీనికి సుస్థిరమగు పునాదు లేర్పరచుటకై ఆలోచించి దీని నుంచుటకు తమయొక్క స్వగృహమగు "సుబ్రియమహల్" ను శాశ్వతముగ నొసంగ వాగ్దత్తమొనర్చి యితర సభ్యులను మూలనిధికై విరాళము లొసంగుడని కోరగా ఆ సమావేశమునందే రు 1800/- లు విరాళములు కొందరు సభ్యులు వాగ్దత్త మొనర్చిరి

శ్రీ ఊ. వేం. శాస్త్రిగారు తమ వాగ్దత్తము ననుసరించి "సుబ్రియమహల్" అను తమ స్వంతభవనమును దానమొనర్చి దానిని ది 10-1-24 తేదీన శ్రీయుత జమునాలాల్ బజాజుమహాశయునిచే తెరిపించి సంఘము నద్దానియందు ప్రవేశపెట్టిరి.

ఆ పిమ్మట శ్రీ శాస్త్రిగా రెంత కృషి యొనర్చినను నితర విరాళములు వాగ్దత్తమైనవి సహితము వసూలు కాకుంటచే తిరిగి 6-7-24 న సంఘసభ్యులను సమావేశపరచగా వారు సమావేశమునందీ క్రిందరీతిగ తీర్మానించిరి. "సంఘమునకు శాశ్వతనిధి లేనందునను సభ్యులు చాల కాలమునుండి చందాలు చెల్లించుట మానివేసినందునను సంఘము పరిపాలనాభారమును భరింపజాలదని యేకాభిప్రాయులమై సంఘమును ప్రస్తుత అప్పుఆస్తులతో నెవ్వరైనను స్వాధీనము చేసుకొని సంఘముఖ్యోద్దేశములకు భిన్నము లేకుండ పరిపాలనము చేయుట కిష్టపడినవారికి సర్వాధికారములతో సంఘముయొక్క యావదాస్తి పరివర్తనము చేయుట కంగీకరించడమైనది.

ఈ తీర్మానము సభ్యులెల్లరకు తెలుపబడి పత్రికాముఖమున ప్రచురపరుపబడెను. కాని యెవరును తమ అంగీకారము తెలుపరైరి. అట్టి స్థితిలో శ్రీ శ్రేష్ఠిగారు తమ స్వంతముననే దీనిని నిర్వహింపదలచి సంఘసభ్యులకు తెలుపగా వారు తిరిగి 31-8-24 తేదీన సమావేశమై యీ క్రింది విధముగా తీర్మానించిరి. “ఇప్పటివరకు సంఘమువారివ్వవలసిన యావత్తు ఋణములను సంఘముయొక్క యావదాస్తియు ఊటుకూరు వేంకటసుబ్బారావుగారు స్వాధీనపర్చుకొని సంఘముఖ్యోద్దేశములకు భిన్నములేని పద్ధతులతో, రు 3000/-లకు తగ్గని మూలధనమున్ను ‘సుబ్రాయమహల్’ అను శాశ్వతభవనమును నొసంగి సర్వస్వాతంత్రములతో పరిపాలించుకొనుటకు వారికధికారమిచ్చుచు సంఘమునందు మనకు గల సర్వహక్కులు వదలుకొనుట కేకగ్రీవముగ నంగీకరించుచు సంఘముయొక్క యావదాస్తియు సదరు ఊటుకూరు వేంకటసుబ్బారావుగారి కీ దినమే స్వాధీనము చేయడమైనది.

పై తీర్మానము ననుసరించి శ్రేష్ఠిగారు సంఘమువారు అప్పటివరకు బాకీపడిన రు 512-1-5 రద్దుపరచి అప్పటివరకు సంఘమునందుగల 808 గ్రంథములను 4 బీరువాలను స్వాధీనపర్చుకొని 1-9-24 నుండియు దీనికి “సారస్వత నికేతనము” అను నూతననామకరణ మిడి దీనికి వారే ధర్మకర్తగ నుండి వీని నిర్వహణమును కడు సమర్థతతో జరుపుచుండిరి.

### పిమ్మట చరిత్ర.

నికేతనమునకు సభ్యులవద్దనుండి చందాలు వసూలుచేయకుండ అందరు నుచితముగను నుపయోగించునటులచేసి, యీపద్ధతి శాశ్వతముగ జరుగగలందులకై కొంత మూలనిధి నేర్పాటు గావించిరి. నికేతనపరిపాలనకు వలయు నియమముల నేర్పరచి నికేతనమునకు శ్రేష్ఠిగారొసంగినభవనము రొక్కము మొదలుగాగల రు7000/- స్థిరచరాస్తులకు 11-11-26న దానపత్రమును వ్రాసి రిజష్టరుచేయించియిచ్చిరి. నికేతనమును 10-6-27న 1860 సం॥ 21 చట్టము ననుసరించి రిజిష్టరు గూడ చేయించిరి.

1931 సంవత్సరములో జరిగిన గుంటూరు మండల గ్రంథాలయ సభవారీ నికేతనగ్రంథాలయమును మండలకేంద్ర గ్రంథాలయములో తీర్మానించియుంటచే నీ గ్రంథాలయమునుండి గ్రంథములు మండలవాసులెల్లరకు నుచితముగ పంపబడుచున్నవి.

స్త్రీలయందు విద్యావ్యాప్తి గావించుటకై స్త్రీలకు వారివారి గృహములకు ప్రత్యేకనౌకరు ద్వారా గ్రంథములు పంపబడుచున్నవి. వారల కప్పుడప్పుడు ప్రత్యేకసమావేశములు గావింపబడుచు నికేతనపు నేటిస్థితి యీ క్రింద బొందుపరుపబడిన చరిత్రనుబట్టి విశదము గాగలదు.

గ్రంథాలయమునం దిపుడు 7386 గ్రంథములున్నవి. అందు 5471 సంస్కృతాంధ్ర ముద్రిత ప్రతులు; 12 లిఖితప్రతులు; 23 తాళపత్రగ్రంథములు; 1822 ఆంగ్లగ్రంథములు; 74 హిందీ గ్రంథములు; 30 ఉర్దూగ్రంథములు; 4 యితర భాషలవి గలవు. 1932 సంవత్సరాంతమువరకు గల గ్రంథముల నామావళి నచ్చొత్తించినారు. 1933 వ సంవత్సరారంభమునుండియు చేర్చబడిన గ్రంథముల కనుబంధ గ్రంథనామావళిని అచ్చొత్తించుటకు ప్రయత్నించుచున్నారు.

ఈగ్రంథాలయమునం దిప్పటి కెనిమిది సంవత్సరములపై కాలమునుండియు అభిమానముతో

స్వల్పవేతనముమీద గ్రంథ భాండాగారిగా నుండి, నిరంతరము నికేతనాభివృద్ధి నభిలషించుచు, శ్రద్ధతో కృషిచేయుచున్న శ్రీయుత, అడుసుమిల్లి శ్రీనివాసరావుపంతులుగారు గ్రంథాలయమునకు రు 116/- ల విలువగల "ఇరువదియవశతాబ్దపు బిజినెస్ ప్రాక్టీస్" అను గ్రంథములను తెప్పించి ఉచితముగ నొసంగియున్నారు.

ఈ గ్రంథాలయమునకేసి గ్రంథములను మదరాసు కనెమరా పబ్లికు గ్రంథాలయము నుండి తెప్పించి, మనగ్రంథాలయపాఠకుల కందజేయగల సౌకర్యమును రాష్ట్రీయప్రభుత్వమువారు ప్రసాదించుచు ఈగ్రంథాలయపాఠకుల కంతవరకు అయిదుపర్యాయములు 28 గ్రంథములను తెప్పించి యందించియున్నారు.

ఈగ్రంథాలయములోని గ్రంథములను మన గుంటూరుమండలవాసు లెల్లరకుచితముగ నొసగుచున్నారు. గతవత్సరమున 38 గ్రామములవారీగ్రంథముల ప్రయోజనమును పొందగలిగిరి. గ్రంథముల నింటికి గొనిపోయిన పురుషపాఠకుల సంఖ్య గతసంవత్సరమున 245. ఈసంవత్సరమున 391. స్త్రీపాఠకులసంఖ్య గతసంవత్సరమున 63. ఈసంవత్సరమున 69. పాఠకుల సంఖ్యలో నభివృద్ధి 152. పురుషపాఠకులు చదివిన గ్రంథములు గతసంవత్సరమున 6,063. ఈసంవత్సరమున 7,109. స్త్రీపాఠకులు చదివిన గ్రంథములు గత సంవత్సరమున 429. ఈసంవత్సరమున 426. పాఠకులకు 15 గ్రంథములు రైల్వేపార్సిల్సుద్వారాను, 854 గ్రంథములు ప్రత్యేక మనుష్యులద్వారాను పంపబడినవి. గ్రంథాలయములో ప్రేక్షకులచే 3,719 గ్రంథములు చదువబడినవి.

ప్రస్తుత మచ్చులో నున్న అలంకారశాస్త్రముల నన్నిటిని మించి, కవికల్పితములైన లక్ష్యలక్షణములుగల యపూర్వమైన "అలంకారశిరోభూషణ"మను తాళపత్ర గ్రంథరాజమును, పూర్వశాస్త్రజ్ఞులపోకడలకన్న క్రొత్త మార్గముల జూపుచున్న "అలంకార సారసంగ్రహ"మను తాళపత్ర గ్రంథరాజమును బ్ర॥ శ్రీ ములుకుట్ల వీరరాఘవశాస్త్రిగారు సంపాదించి యిచ్చిరి. ఈరెండుగ్రంథరాజములును ఇంకొల్లు నివాసులు, కవిపండితుల సంఘమునకు చెందిన కీ॥ శే॥ దాసరి రామదాసుకవిగారి ముద్దులమూటగట్టు, మిత్ర్యములబోలు స్వదస్తూరితో వ్రాయబడియున్నవి. వారి త త్కవివిరచితములగు "సారస్వతవ్యాకరణము", "స్వాహాపకోశము", "కవిరాజశేఖరాభూషణము", అను నమూల్యమైన తాళపత్రగ్రంథరాజములను, కొండవీటికాగితములపై వ్రాయబడిన "సద్వృత్త"మను గ్రంథమును శ్రీ శాస్త్రులవారు సేకరించి దయచేయుచినారు. ఈగ్రంథములు శిథిలములై పురుగులకాహారమగుచున్నందున శ్రీ శాస్త్రులుగారు "అలంకార శిరోభూషణము"ను "అలంకార సారసంగ్రహము"ను కాగితములపై ఎత్తివ్రాసి యిచ్చేయించినారు. శ్రీ శాస్త్రులవారీ గ్రంథాలయముపై చూపుచున్న శ్రద్ధాభిమానములు నన్నుతాతీతములు. వారికి సర్వదా కృతజ్ఞులము.

పఠనాలయము:—

పఠనాలయము నలంకరించుచున్న వార్తాపత్రికలు:-ఆంధ్రపత్రిక, సమదర్శిని, ప్రజామిత్ర, కృష్ణాపత్రిక, త్రిలిజ్ఞ, ధర్మసాధని, దర్బారు, స్వతంత్ర, భారతమైత్రి, భారతి, గృహలక్ష్మి, వాసవి, ఆరోగ్యప్రకాశిక, సరస్వతి, భక్తిప్రబోధిని, వినోదిని, సత్యదూత, వివేకవతి, దివ్యజ్ఞానదీపిక, బాలమిత్ర, తీర్పులపత్రిక, ఆంధ్రభూమి, హిందూమాడరన్ రెవ్యూ, ప్రబుద్ధభారత, ఫెడరేటెడ్ ఇండియా, మద్రాసు కో-ఆపరేటివ్ జర్నల్, హెల్త్, ఆంధ్ర

హిస్టారికల్ రిసర్చి సొసైటీ జర్నలు, భారతధర్మ, ఇన్స్యూరెన్సు రెవ్యూ, గోష్ఠి, ఇండియన్ రైల్వే మాగజైను, మై మాగజైను, అన్‌నజీర్.

ఇందు - సమదర్శిని, త్రిలిఙ్గ, భారతి, భారత వైశ్య, ప్రజామిత్ర, స్వతంత్ర, దివ్యజ్ఞానదీపిక, ఫెడరేటెడ్ ఇండియా, అన్‌నజీర్ అను పత్రికల నాయా పత్రికాధిపతు లుచితముగా దయచేయు చున్నారు గాన వారికి వందనములు.

ఆంధ్రపత్రిక, హిందూ, ఇండియన్ రైల్వే మాగజైను, మాడరన్ రెవ్యూ, తీర్పులపత్రిక, మై మాగజైను, ఆంధ్రభూమి, సరస్వతి అను పత్రికల నాయా పత్రికాధిపతులు తగ్గింపుచందాల కొసంగుచున్నారు.

సత్యవతి, వివేకవతి, బాలమిత్ర అను పత్రికలను చీరాల మిస్. ఏ. యం. జాన్సన్ దొర సానిగా రుచితముగ పంపుచున్నారు. చీరాల యు. యల్. సి. మిషను రెవరెండు యల్. ఏ. గాట్వాల్సు దొరగారు తాము తెప్పించుకొను చున్న ఆంగ్లమాసపత్రికలను పంపుచున్నారు.

పఠనాలయమున కనుదినము దాదా పేబది మంది ప్రేక్షకులు పత్రికాపఠనమున కరుదెంచు చుందురు.

వ్యాసరచన:—

గ్రంథాలయపాఠకులకు ప్రోత్సాహ మొసంగుటకు వ్యాసరచనపోటీని గతరెండుసంవత్సరములు పాఠకులకుమాత్రమే యేర్పాటొనర్చితిమి. కాని పాఠకు లీ ప్రోత్సాహప్రయోజనమునుపొంద గుతూహలము చూపకుండిరి. ఆ కారణమున ఈ వ్యాసరచననిధికై శాశ్వతవిరాళము నొసంగిన శ్రీయుత నారపరాజు రామమూర్తిపంతులుగారితో సంప్రతించి ఆకర్షణీయ మగు మరొక విధానమును నిర్ణయింప యత్నించుచున్నారు.

ఉపన్యాసములు:—

నికేతనయాజమాన్యమున దేవీనవరాత్రములం దుపన్యాసము లిప్పింపబడుచుండును.

పండుగలు, జయంతులు:—

శరన్నవరాత్రములందు శ్రీ సరస్వతీదేవియారాధన, ఉగాదిరోజున పంచాంగ శ్రవణము, శ్రీరామజయంతి, శ్రీవినాయకజయంతి మున్నగు పండుగులు, జయంతులు వైభవముతో జరుపబడుచుండును. పురాణశ్రవణముగూడ గావింపబడుచుండును.

పోటీయాటలు:—

ప్రతిసంవత్సరము బాడ్మింటన్ ఆటయందు పోటీలు జరుపబడి, జయించినవారలకు రజత పాత్రలు బహుమతులుగ ఒసంగబడుచున్నవి.

ప్రదర్శనము:—

గతవార్షికసభల కనుబంధముగ గ్రంథాలయ ప్రదర్శనమును జరిపియున్నారు.

మత, వేదాంత, ధర్మ, విద్యా ప్రబోధకమై యొప్పు శ్రీభగవద్గీతాప్రదర్శనము నేర్పాటు గావించిరి. ఈ ప్రదర్శనముల సాహాయ్యమువలన జనసామాన్యములో విద్య, జ్ఞాన, ధర్మ, బుద్ధు, లలవడుట కవకాశములు గలవు.

మండల కేంద్రగ్రంథాలయమై యొప్పుచు, భాషాసేవయు, మానవసేవయు, దేశసేవయు యథాశక్తియుతముగ గావించుచున్న యీ నికేతనమునకు పరమేశ్వరానుగ్రహమున స్వంత భవనము గలదు. పోటీయాటలకు నిధికలదు. భజనకాలక్షేపములకు నిధి యున్నది. వ్యాసరచ

నకు నిధి యున్నది. నిత్యపోషణకు నిధి కలదు. అత్యంతావశ్యకమగు గ్రంథసంపాదనకు, పత్రికా సంపాదనకు మాత్రము వలసినంత మూలనిధి లేకున్నది. ఇందులకు లక్ష్మీపుత్రులు, దానకర్ణులనందగిన తమరందఱి సంపూర్ణ సాహాయ్యా సానుభూతులను నికేతన మాకర్షించుచున్నది.

## నె 7 రు అనుబంధము.

### గ్రంథాలయపాఠకుల నివాసగ్రామములు.

బాపట్ల తాలూకా:
1 వేటపాలెము
2 నాయనిపల్లి
3 చీరాల
4 పేరాల
5 జాండ్రపేట
6 యీపూరిపాలెం
7 బాపట్ల
8 కారంచేడు
9 స్వర్ణ
10 ఉప్పుటూరు
11 పరుచూరు
12 యింకొల్లు
13 పావులూరు
14 సంతరావూరు
15 రంగప్పనాయుడుపాలెం
16 పందిళ్ళపల్లి
17 కడవకుదురు
18 మోటుపల్లి
19 చినగంజాం
20 బేతపూడి
21 యిడుపలపాడు
22 పూసపాడు

ఒంగోలు తాలూకా:
1 గంగవరం
2 తిమ్మసముద్రం
3 భీమవరం
4 ఉప్పుగుండూరు
5 ఉమ్మెనవరం
6 కనుపర్తి
7 ఒంగోలు
8 పంగులూరు
9 చందలూరు
10 చింతగుంపుల

గుంటూరు తాలూకా:
1 గుంటూరు

నరసరావుపేట తాలూకా:
1 బొబ్బేపల్లి

తెనాలి తాలూకా:
1 చేబ్రోలు
2 పెదపాలెము
3 పాంచాలవరం

రేపల్లె తాలూకా:
1 రేపల్లె

## నె 8 రు అనుబంధము.

### గ్రంథాలయ పాఠకుల వర్ణ వివరములు:—

| | పురుషులు. | స్త్రీలు. | | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|---|---|---|
| బ్రాహ్మణులు | 119 | 30 | రెడ్డి | 3 | — |
| వైశ్యులు | 83 | 15 | ఆదిఆంధ్ర | 1 | — |
| దేవాంగులు | 60 | 1 | యితరహిందువులు | 9 | 6 |
| పద్మశాలీయులు | 46 | — | మహమ్మదీయులు | 8 | — |
| తెలగలు | 25 | 7 | క్రైస్తవులు | 9 | 1 |
| కమ్మ | 17 | 2 | | — | — |
| విశ్వబ్రాహ్మణులు | 5 | 3 | మొత్తం | 391 | 69 |
| వెలమలు | 6 | 4 | | — | — |

### —♦ నికేతన స్థిరచరాస్తి పట్టిక ♦—

| | | | |
|---|---|---|---|
| మూలధనము నగదు | 7893-15-0 | కుర్చీలు, బల్లలు, మేజాలు, వగైరా | 125-0-0 |
| నికేతన పోషణనిధి 5463-15-0 | | గోడగడియారం | 43-0-0 |
| పోటీయాటలనిధి 500- 0-0 | | హార్మోనియము | 25-0-0 |
| వ్యాసరచననిధి 500- 0-0 | | చిత్రపటములు | 280-0-0 |
| వార్తాపత్రికలనిధి 100- 0-0 | | పిరాళ శాసనములు | 273-0-0 |
| భజనకాలక్షేపనిధి 1330- 0-0 | | పోటీయాటల రజతపాత్రలు 2 కి | 150-0-0 |
| స్థిరాస్తి విలువ | 1376-1-0 | | |
| గ్రంథముల విలువ | 8140-0-0 | మొత్తం | 23,341-0-0 |
| సుబ్రాయమహల్ విలువ | 4450-0-0 | | |
| అద్దాల బీరువాలు 20 కి విలువ | 585-0-0 | | |

### —♦ నికేతనముయొక్క మూలనిధి పట్టిక ♦—

వసూలు వివరములు

| | | | |
|---|---|---|---|
| ప్రధాన పోషకులవలన ... | 3116-0-0 | శ్రీ సీతారామాంజనేయ భజనకాలక్షేపములనిధి ... | 1330-0-0 |
| రాజపోషకులవలన ... | 2252-0-0 | | |
| పోషకులవలన ... | 500-0-0 | మొత్తము. | 9270-0-0 |
| అభిమానులవలన ... | 1972-0-0 | | |
| సహాయులవలన ... | 100-0-0 | | |

ఆరా:—

| | | |
|---|---|---|
| నికేతన పోషణనిధి:- | | 6840-0-0 |
| నగదు | 5463-15-0 | |
| స్థిరాస్తి | 1376-1-0 | |
| పోటీయాటలనిధి | | 500-0-0 |
| వ్యాసరచననిధి | | 500-0-0 |
| వార్తాపత్రికలనిధి | | 100-0-0 |
| భజనకాలక్షేపనిధి | | 1330-0-0 |
| | | 9270-0-0 |

### —♦ పెట్టుబడి వివరములు ♦—

| | | |
|---|---|---|
| ఊ. వెం. శ్రేష్ఠిగారి తావున వడ్డీకి నిల్వయున్నది | | 7893-15-0 |
| స్థిరాస్తి | | 1376- 1-0 |
| భూములు | 505-0-0 | |
| ఇండ్లుస్థలము | 871-1-0 | |
| మొత్తం | | 9270-0-0 |

# ఊటుకూరి వేంకట సుబ్బరాయశ్రేష్ఠి

మహారాజశ్రీ ఊటుకూరి వేంకట సుబ్బరాయ శ్రేష్ఠిగారు మరణించిరను వార్త గ్రంథాలయోద్యమాభిమానులను విచారసాగరమున ముంచివేసినది. శ్రీ సుబ్బరాయశ్రేష్ఠిగారు వేటపాలెములోని సారస్వతనికేతనమునకుఁ బ్రతిష్ఠాపకులును పోషకులునునై చేసిన సేవ యపారము. ఆంధ్రభారతీతీర్థ పరీక్షామంత్రియై విజయనగర మహారాజావారి యాజమాన్యముక్రింద నడుపఁబడుచున్న భారతీతీర్థ పరీక్షలను జేయుచున్నారు. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమాభివృద్ధికై సభ్యుముగ్రట్టె పనిచేయుచున్నారు. కేంద్ర గ్రంథాలయముకొరకు కృషిచేయుచున్నారు. ఆంధ్రులను విజ్ఞానవంతులనుగాఁ జేయుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఇట్టి తరుణమున, అకాలమృత్యుదేవత సహింపలేక శ్రేష్ఠిగారిని మ్రింగివేసినది. ఆంధ్రులకు శ్రేష్ఠిగారి మరణమువలనఁ దీఱనికొఱంత గలిగినది.

ఉదారులును శ్రీమంతులును దేశసేవకులు నగు మహారాజశ్రీ ఊటుకూరి వేంకట సుబ్బరాయశ్రేష్ఠిగారి యకాలమరణమునకుఁ జింతిల్లుచు వారి కుటుంబమునకు మా శ్రీకృష్ణ గ్రంథాలయముతరఫున సానుభూతిని దెలియఁజేయుచున్నాఁడను.

కోగంటి దుర్గామల్లికార్జునరావు,
అధ్యక్షుఁడు,
శ్రీకృష్ణ గ్రంథాలయము, ఉంగలూరు.

---

"గ్రంథాలయబంధు"

## శ్రీమందలపర్తి ఉపేంద్రశర్మ బి. ఏ. ఆనర్సు.

గ్రంథాలయములు దేశాభ్యుదయమునకు తోడ్పడిన ట్లితరములు తోడ్పడవు. గ్రంథాలయోద్యమ మభివృద్ధినందిన దేశము లత్యంత నాగరకములై యొప్పుచున్నవి. ఆంధ్రదేశమునం దీయుద్యమమువల్ల పలువుర కభిమానమున్నను పరిషత్తువారి ప్రాపకమును బొందుట కిదియే ప్రథమసంవత్సరము. పరిషత్కళాశాల విద్యార్థులలో నీ యుద్యమము నధికముగా నభిమానించువారిలో ముఖ్యులు శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మగారు.

శ్రీ శర్మగా రాంధ్రదేశమున కీవలనే పరిచయులైన యువకులు. వీరికి గ్రంథాలయోద్యమముపట్ల అభిమానము మెండు. వీరీయుద్యమము లనుగూర్చి ఆంధ్రదైనికపత్రికయందును ఆంధ్రమాస పత్రికలందును అనేకవ్యాసములు వ్రాసియున్నారు. వీరు గ్రంథాలయ యాత్రలందు (యథోచితముగ) తోడ్పడి వారి గంభీరోపన్యాసములచేత ప్రజలలో నూతనోత్తేజమును గల్గించినారు. భీమవరం తాలూకా గ్రంథాలయ యాత్రయందు పాల్గొని కొన్ని గ్రామములు మాతో తిరిగినారు. పెక్కు గ్రంథాలయ సభలలో ఉపన్యాసములు గావించుటయేగాక చక్కని Pamphlets ను సైతము చదివియుండిరి.

ప్రాచ్యపాశ్చాత్య దేశములందలి గ్రంథాలయోద్యమములను గూర్చి సమగ్రముగా పఠించిరి. ఈవిషయము వీరి గ్రంథాలయోద్యమ వ్యాసము వ్యక్తము చేయగలదు. ఈవ్యాసము యావదాంధ్రవ్యాసము పోటీలో కల్యాణపురాంధ్ర సంఘమువారిచే ప్రథమ బహుమానము పొందెను. వీరు వ్యాసలేఖన, వక్తృత్వ పరీక్షలలో ప్రథమ బహుమానములను పతకములను, పాత్రలను (cups) పొందియున్నారు. ఆంధ్ర వాఙ్మయ విషయికములగు వీరి వ్యాసములు పత్రికలయు ప్రముఖులయు మన్ననల నందినవి.

ఆంధ్రగద్య వాఙ్మయ చరిత్రను వ్రాయుట కుత్సాహించు సవ్యులలో వీ రొకరు. ఇట్టివా రాంధ్ర వాఙ్మయమునకును (ఆంధ్ర) గ్రంథాలయోద్యమమునకును అత్యంతమైన సేవచేసి శ్రేయస్సు నాపాదింపగలరు. యావదాంధ్ర వ్యాసలేఖన పోటీలో ప్రథమబహుమతినందిన వీరి ప్రథమవ్యాసము "గాంధీమహాత్ముని ప్రవేశము - దానిఫలితములు". ఈపత్రికయందు ముద్రింపబడిన "గ్రంథాలయోద్యమము" పయి పోటీలో ప్రథమబహుమతినిబడసిన వీరిద్వితీయ వ్యాసము. వీరు ప్రస్తుతము ఆంధ్ర యూనివర్సిటీవారిచే ఏర్పాటుచేయబడిన గ్రంథాలయ శిక్షణ తరగతులలో తరిఫీయదుపొందుచున్నారు.

శర్మగా రాంధ్రవిశ్వకలా పరిషత్కలాశాల తెలుగుసంఘమునకు కార్యదర్శిగను అధ్యక్షులుగను ఉండి సంఘకార్యములను చక్కగా నిర్వర్తించి యుండిరి. బ్రిటిష్ డిబేటింగ్ టీమ్ (ఆంగ్లవక్తృత్వపుజట్టు) ఆంధ్రయూనివర్సిటీకి వచ్చినపుడు వీరు ఆంధ్రవిశ్వకలా పరిషత్కలాశాల విద్యార్థిబృందమున కధ్యక్షులుగ నుండిరి. వీరికి వక్తృత్వాదు లందునేగాక వేషధారణాదు లందును ప్రవేశము అభిమానము గలవు. వేషధారణమునకు ప్రతివత్సరము (ప్రయిజు) బహుమానములను యూనివర్సిటీ కాలేజీలో పొంది యుండిరి. వీరి వక్తృత్వ వ్యాసరచనా నైపుణ్యాదులగూర్చి పండితులు, తెనుగు ఉపాధ్యాయ వర్గము, వైసుఛాన్సలరు రాధాకృష్ణన్, ప్రిన్సిపాలు కోయాజీ, ప్రొఫెసరు వెంకటరంగయ్య ప్రభృతులు ప్రశంసావాక్యముల వ్రాసియుండిరి.

శర్మగారివంటి విద్యాధికులగు యువకులు గ్రామగ్రంథాలయముల స్థాపించి వానియభివృద్ధికి తోడ్పడుట మన యుద్యమమునకు మిక్కిలి శ్రేయోదాయకము. వారీకార్యమును వదలక నిర్వహించిన ఆంధ్ర గ్రంథాలయోద్యమము చిరస్థాయియై ఇతోధిక సేవచేయగలదనియు గనుక ఆంధ్రయువకులందరీమహాకార్యమునకు ద్విగుణీకృతోత్సాహముతో పూనుదురనియు నానమ్మిక.

ఆంధ్ర విశ్వకలా పరిషత్తువారు ఉపేంద్రశర్మగారివలె గ్రంథాలయ శిక్షణము గఱచినటువంటియు, ఆంధ్రము నభిమానవిషయముగ పఠించినటువంటియు విద్యార్థులనాదరించి, అబ్బూరి రామకృష్ణారావు F. L. A. గారివంటి తెలుగు పండితులను ప్రోత్సాహపఱచియు ఆంధ్రగ్రంథములకొకనూతన వర్గీకరణ పద్ధతిని(classification scheme) నిర్మాణము చేయించియు మార్గదర్శకు లగుదురుగాక

---

# గ్రంథాలయములు.

యన్. జి. శాస్త్రి

ఆ. వె. ఆలయములలోన నవని గ్రంథాలయం
బురుఫలప్రదంబు; పరమతస్థు
లెందరైన దీని పొందఁగా వీలగు,
నంటుదోస మిచట నరయరాదు.

తే. గీ. ఆకసమునుండి కటికి చీకటిని న
శింపఁగాఁజేయు పూర్ణశశివలె, నాల
యాల రాజులు గ్రంథాలయాలు, పామ
రాళి యజ్ఞానమును బాఱఁదోలు కతన,

తాడేపల్లిగూడెము తాలూకా,

# ద్వితీయ గ్రంథాలయ మహాసభ

పెంటపాడు 6-7-35 వ తేది

శ్రీ తాడేపల్లిగూడెము తాలూకా ద్వితీయ గ్రంథాలయమహాసభ 6-7-35 వ తేదిని, మధ్యాహ్నం 2 గంటలకు, పెంటపాడు, శ్రీ శ్రీనివాస గ్రంథాలయ భవనములో, సుప్రసిద్ధ దేశభక్తులును, ఆంధ్రనాయకులును నగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి యధ్యక్షతక్రింద అఖండ జయప్రదముగ జరిగెను. తాలూకా లోని అన్ని గ్రంథాలయములనుండియు ప్రతి నిధు లరుదెంచిరి. శ్రీమతులు దామోజిపురపు లక్ష్మీనరసమ్మ, తేతలి సావిత్రమ్మగార్లును, ఇంకను మరికొందరు సోదరీమణులును సభకరు దెంచిరి. బాలికలు తమ కోమల కంఠములతో దైవప్రార్థన గావించిరి. పిమ్మట ఆహ్వానసంఘా ధ్యక్షులగు వి. వి. నరసింహాచార్యులుగారు ప్రతి నిధులకును, అధ్యక్షులకును స్వాగత మొసగుచు నుపన్యసించిరి. పిమ్మట శ్రీయుత వితాల వీర భద్రరావుగారు లేచి, సభా ప్రారంభోపన్యాసకు లగు, శ్రీయుత తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారిని సభవారి కెరుకపరచి సభాప్రారం భోత్సవమును జరుపవలసినదిగా కోరిరి. అంతట శ్రీ ప్రకాశరాయుడుగారు లేచి, మానవుడు, మానవసేవ, ప్రేమ మున్నగు విషయములను గురించియు, గ్రంథాలయములు, వాని ప్రచా రము, ప్రజలయెడ చేయవలసిన సేవ మున్నగు విషయములను సాకల్యముగ నుపన్యసించిరి.

పిమ్మట సభాధ్యక్షులగు శ్రీయుత అయ్య దేవర కాళేశ్వరరావు పంతులుగారు మానవుడు, మానవుని పరమావధి, మానవజన్మయొక్క ఉప యోగము, అక్షరజ్ఞానప్రచారము, విద్య మొద లగు విషయములనుగూర్చి యుపన్యసించిరి. గ్రంథాలయములు-వాని వ్యాప్తిని శ్రీపంతులుగా రుపన్యసించుచున్నప్పుడు, సభ్యులు తరుచుగ బ్రహ్మాండమగు కరతాళధ్వనులుచేయుచు తమ యానందమును వెలిబుచ్చిరి.

కార్యదర్శి నివేదిక:—పిమ్మట తాలూకా గ్రంథాలయసంఘ కార్యదర్శియగు శ్రీయుత, దద్దనాల లక్ష్మీసత్యనారాయణయ్యగారు లేచి, సంఘమువా రింతవరకును చేసిన కృషిని, కార్య క్రమమును, ప్రచారమును, జమాఖర్చులను, సభ్యులసహకారమును, మహనీయులవిరాళము లను, ఇకముందు సంఘమువారు చేయుచున్న కార్యక్రమమును గురించియు, తమ నివేదికను సభ్యులకు చదివి, వినిపించుచు, ఇట్టి కృషికిని, నిట్టి యభివృద్ధికిని, నిట్టి యమూల్య సేవకును కారణభూతులగు శ్రీ డాక్టరు తేతలి సత్యనారా యణమూర్తి పంతులుగారికి, సంఘమువారితర పున, తమకృతజ్ఞతాభినందనముల నర్పించిరి.

ఇతరోపన్యాసములు:—పిమ్మట శ్రీయుత మందలపర్తి ఉపేంద్రుడు బి.ఏ. (ఆనర్సు), భూపతి రాజు తిరుపతిరాజు, వావిలాల గోపాలకృష్ణయ్య, ముదిగంటి జగ్గన్నశాస్త్రి, అయ్యంకి వేంకటరమ ణయ్యపంతులు, వితాల వీరభద్రరావుగార్లు 'గ్రంథాలయములు ప్రజలకు చేయుచున్న సేవ, గ్రంథముల మంచిచెడ్డలు' అను విషయములను గురించి ఉత్తేజకరములగు నుపన్యాసముల నిచ్చిరి.

అధ్యక్షుని అంత్యోపన్యాసము:— చివరకు అధ్యక్షులు లేచి, ఈతాలూకాగ్రంథాలయ సంఘమువారు చేయుచున్న గ్రంథాలయప్రచారమును నిరుపమానసేవను చాల ప్రశంసించుచు, నిందుకుముఖ్యులగు శ్రీయుత డాక్టరు సత్యనారాయణగారిని, మిగుల గొనియాడి, పాశ్చాత్యదేశములు-వాని పరిణామమును గూర్చియు గ్రంథాలయములు ప్రజలకు ఉపకరింపదగినపద్ధతులను గూర్చియు గంభీరోపన్యాసమిచ్చిరి

1. తీర్మానములు:— రాబోవు సంవత్సరమునకు తాలూకాగ్రంథాలయసంఘమునకు క్రిందివారు అధికారవర్గముగ నెన్నుకొనబడిరి:— శ్రీయుతులు తల్లాప్రగడ శివేశ్వరరావు బి. ఎ.గారధ్యక్షులు; శ్రీయుత దద్దనాల లక్ష్మీనసత్యనారాయణయ్యగారుపాధ్యక్షులు; శ్రీయుత డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు ప్రధాన కార్యదర్శులు; శ్రీయుత పుట్టా సుబ్బారావుగారు సంయుక్తకార్యదర్శులు.

2. గ్రంథాలయోద్యమమునందు విశేషకృషి చేసిన శ్రీయుతులు, భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మ, పూటుకూరి వెంకట సుబ్బరాయ శ్రేష్ఠిగార్ల అకాలమరణములకు ఈసభవారు చింతిల్లుచు, వారియాత్మలకు శాంతి చేకూరుగాకయని కోరుచున్నారు.

3. 17-11-33 మొదలు 31-3-35వరకు జరిగిన కృషినిగురించి కార్యదర్శి, శ్రీయుత లక్ష్మీనసత్యనారాయణయ్యగారిచే చదువబడిన - నివేదికను, జమఖర్చులను ఆమోదించుచు, వారికి ఈసభవారు వందనము లర్పించుచున్నారు.

4 ప్రస్తుతము నిర్వహింపబడుచున్న (ఈ తాలూకాలో) 51 గ్రంథాలయములును, ఆయా గ్రామములందలి పంచాయితీబోర్డులును, సహకారసంఘములును, గ్రామస్థులును విరివిగా విరాళముల నొసగవలసినదిగ నీసభవారు కోరుచున్నారు.

5. జిల్లాబోర్డువారిచే వ్యవహరింపబడుచున్న మూడుగ్రంథాలయములకుగాక తక్కిన48గ్రంథాలయములకు గ్రంథాలయము 1 కి సాలునకు 50 రుల చొ॥ విరాళము నొసగవలసినదని జిల్లాబోర్డువారిని ఈసభవారు కోరుచున్నారు.

6. ప్రతిసంవత్సరము గవర్నమెంటువారు గ్రంథాలయములనిమిత్తము శాంక్షనుచేయుచున్న సొమ్మునుండి గ్రామగ్రంథాలయములకేమియు వచ్చుటలేదు. సదరు విరాళపుసొమ్ము, హెచ్చుగా శాంక్షనుచేయుటకును, అందునుండి ప్రతిగ్రంథాలయమునకు అధమము 50 రూపాయలయినను ముట్టునట్లు ఏర్పాటుచేయుటకును ఈసభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

7. జిల్లాయందంతటను గ్రంథాలయోద్యమము ప్రచారముచేయుటకు జిల్లాగ్రంథాలయోద్యోగి నొకనిని నియమించవలయునని ఈసభవారు జిల్లాబోర్డువారిని కోరుచున్నారు.

8. పంచాయితీ ద్రవ్యమును వార్తాపత్రికలకు వినియోగించరాదని లోకలుబోర్డుయినస్పెక్టరుగారు జారీచేసిన 85 ఉత్తరువును రద్దుచేయించవలసినదిగా వారిని ఈసభవారు కోరుచున్నారు.

9. 1860 సం॥ము 21 చట్టము ప్రకారము గ్రంథాలయములను రిజిష్టరు చేయించుటకు చెల్లించవలసిన 50 రు॥లను, రు 5-0-0 లకు తగ్గించవలసినదిగా ప్రభుత్వమువారిని కోరడమయినది.

10. ప్రతిగ్రంథాలయమును క్రొత్తపుస్తకములు తెప్పించుటకుముందు పుస్తకముల జాబితాను జిల్లావిద్యాశాఖాధికారి అనుమతికి

పంపుపద్ధతివలన, గ్రంథాలయ నిర్వాహకుల కెంతయు నిబ్బంది గలుగుచున్నదిగాన ఈపద్ధతి తొలగించుటకును, ప్రతిగ్రంథాలయమునకును నిషేధింపబడినగ్రంథములజాబితానొకటిపంపుచు అవి మినహాయించి తక్కిన పుస్తకములన్నియు తెప్పించుట కనుమతి యియ్యగలందులకును, జిల్లావిద్యాశాఖాధికారిని కోరడమయినది.

11. ఆంధ్రదేశగ్రంథాలయసంఘము రిజష్టరీ అయినది గనుక ఆంధ్రదేశగ్రంథాలయసంఘము నందు చేరిన శాఖలను, తాలూకాగ్రంథాలయ సంఘములు, అందు చేరిన గ్రామ గ్రంథాలయ ములను రిజష్టర్డుసంఘములుగ పరిగణించ వలసినదిగా, ఈసభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

12. తాడేపల్లిగూడెంతాలూకాగ్రంథాలయ సంఘమును, ఆంధ్రదేశ గ్రంథాలయమునకు శాఖగా చేర్చుటకు తీర్మానించడమయినది.

13. తాలూకాగ్రంథాలయసంఘమువారిచే సిఫార్సుచేయబడిన గ్రంథాలయముల కన్నిటికిని, సాలునకు రు 18-0-0 చొ॥న చందాకు ఆంధ్ర దైనికపత్రిక నిప్పించవలసినదిగా ఆంధ్రపత్రికా ఆఫీసువారిని కోరడమయినది.

14. గ్రంథాలయసేవకు లందరును, రాయల సీమసాహాయ్యార్థము ధాన్యము, గడ్డి, ధనము, వసూలుచేసి, కఱవునివారణసంఘమునకు పంప వలసినదిగా కోరడమైనది.

15. ఆంధ్రరాష్ట్రమును వెంటనే మదరాసు రాజధానిలోనుండి విభజించుటకును, జయపురము బరంపురము, జలంత్ర, పర్లాకిమిడి మున్నగు ఆంధ్రప్రాబల్యప్రదేశములను ఒరిస్సాలో గలుపుట చాల అన్యాయమనియు, ఆంధ్రరాష్ట్రమునకు ఉత్తరసరిహద్దు లోగడ అంగీకరింపబడిన ఋషికుల్యానదియే న్యాయమనియు, ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు. మరియు దక్షిణమున మదరాసునగరమును, పశ్చిమమున బళ్లారిజిల్లా అంతయు, ఆంధ్రరాష్ట్రములోని భాగములే యనియు నీ సభవారు తీర్మానించు చున్నారు.

16. రాబోవుసంవత్సరము మూడవతాలూకా గ్రంథాలయమహాసభను 1936 సం॥రము ఏప్రిల్ నెలలో బొమ్మిడిగ్రామములో జరుపుటకు తీర్మానించడమయినది.

షరా:— ఇందు 8వ తీర్మానములోని 85 సర్క్యులరులో ప్రకారము, పంచాయతిద్రవ్యము నుండి వార్తాపత్రికకు, ఖర్చుపెట్టువిషయములో లోకలుబోర్డ్ ఆక్ట్ 112 ను బట్టి గవర్నమెంటు అనుమతి అవసరములేదని ప్రకటించిరి.

తాడేపల్లిగూడెం, 30—10—35. } తే. సత్యనారాయణమూర్తి, తాలూకాగ్రం॥ సంఘకార్యదర్శి.

---

# గుంటూరు మండల గ్రంథాలయ సంఘము

నూతన కార్యనిర్వాహక వర్గపు ఎన్నికలు.

ది 17-8-35వ తేదీ శనివారము మధ్యాహ్నము 1 గంటకు తెనాలిపట్టణమున కాంగ్రెసు భవనమునందు శ్రీయుత, శరణు రామస్వామి చౌదరిగారిఅధ్యక్షతను సమావేశమైన గుంటూరు మండల గ్రంథాలయ సంఘ సాధారణ సభయందు దిగ్రింది తీర్మానములు గావింపబడినవి.

౧ సానుభూతితీర్మానము.

ఈమండల గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులుగా నుండి దీనియభివృద్ధికి మిక్కిలి తోడ్పడినట్టియు, వేటపాలెములోని సారస్వత నికేతన ప్రతిష్ఠాపకులై దానికి ఇరువదివేల రూపాయల విలువగల ఆస్తి నిచ్చి శాశ్వతముగా నుండుటకు భవనము నొసంగి వృద్ధిలోనికి తెచ్చినట్టి గ్రంథాలయ సేవకులు, శ్రీ. ఊ. వెం. శ్రేష్ఠి గారి అకాలమరణమున కీసంఘమువారు చింతిల్లుచు, వారిఆత్మశాంతికి భగవంతుని ప్రార్థించుచు, వారికుటుంబమునకు సానుభూతి సందేశ జేయుచున్నారు.

౨. కార్యనిర్వాహక వర్గము.

ఈసంవత్సరము (1935-36) నకు ఈక్రింది వారిని కార్యనిర్వాహక వర్గముగా ఎన్నుకొనడమైనది.

శరణు రామస్వామిచౌదరిగారు (అధ్యక్షులు); ఊటుకూరు జయరామదాసుగారు; కస్తూరి కుటుంబరావుగారు (ఉపాధ్యక్షులు); పాతూరి నాగభూషణంగారు (కార్యదర్శులు); అడుసుమిల్లి శ్రీనివాసరావుగారు, వాపిలాల గోపాలకృష్ణయ్యగారు (సహాయకార్యదర్శులు); వెన్నం కోటయ్యగారు, పి. పాలెంకయ్యగారు, యెండూరి నాగయ్య చౌదరిగారు, పాటిబండ్ల రంగినాయకులుగారు, మేకా కోటిరత్నగారు, మండలపర్తి ఉపేంద్రశర్మగారు, ఆ. జాషువకవిగారు, తిరునగరి వెంకట నరసమూర్తిగారు.

౩. కార్యాలయముమార్పు.

వేటపాలెమునుండి కార్యాలయమును కార్యదర్శినివాసస్థలమగు పెదపాలెము (పేరకలపూడి పోస్టు- తెనాలితాలూకా) కు మార్చుచు నిబంధనలలో అవసరమగు మరికొన్ని మార్పులు గావింపబడెను.

| | |
|---|---|
| పెదపాలెము,<br>18—8—35. | పా. నాగభూషణం,<br>కార్యదర్శి. |

షరా:—ఇకముందునుండి ఉత్తరప్రత్యుత్తరములు జరుపగోరువారు "కార్యదర్శి - గుంటూరుమండల గ్రంథాలయ సంఘము, సేవాశ్రమము, పెదపాలెము (via) దుగ్గిరాల" అను చిరునామాకు వ్రాయ ప్రార్థితులు.

---

# భారత దేశ విద్యాహీనత

మల్లెల శ్రీరామమూర్తి,
సహాయకార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, బెజవాడ.

సమస్తవిద్యలతో తులతూగి ప్రపంచానికి ఆదర్శప్రాయమై అఖండఖ్యాతి వహించిన భారతవర్షం నిఖిల ప్రపంచంలో ఈనాడు ముఖ్యంగా విద్యావిషయంలో వెనుకబడి వుండడమేకాదు; అధోలోకంలో వుంది. స్వతంత్రత గలిగిన పాశ్చాత్య దేశాల్లో 100కి 90 మంది చదువుకున్న వాళ్లుంటే పరాధీనతలోవున్న కారణంవల్ల భరతభూమిలో విద్యవచ్చినవాళ్ళు 100 కి 10 మంది బొటాబొటిగావుండడంవల్లనే మనదేశంలో విద్యాప్రచారం ఎంతఅధమస్థితిలో వుందో సులభంగా గ్రహించవచ్చును. దాదాపు 150 సంవత్సరాల బ్రిటిష్ పరిపాలనలో కలిగిన ఫలితం యిలావుంది విద్యావిషయంలో!

పాశ్చాత్య దేశ ప్రభుత్వాలు బాలురకు నిర్బంధంగా విద్యనేర్పించడానికి ప్రభుత్వం బొక్కసం నుంచి విరివిగా ధనంవెచ్చించి విద్యాబోధ చేస్తున్నాయి. బ్రిటిష్ ప్రభుత్వానికి లోబడి వున్న భారతదేశంలో ప్రజలనెత్తిన పన్నులు రుద్దుటయేగాని విద్యావిషయంలో పుష్కలంగా ధనంవెచ్చించకపోవడంవల్లనూ నిర్బంధంగా విద్యాప్రచారం చేయటానికి ప్రభుత్వం పూనుకోకపోవడంవల్లనూ, విద్యావిషయంలో భారత ప్రజలు చాలా వెనకబడియున్నారు. విద్యావంతులంటే అందరూ పండితులు పట్టభద్రులు కానక్కరలేదు. రాష్ట్ర (మాతృ) భాషలోనైనా ప్రాథమికవిద్య వరకైనా మనిషిఅనేవాడు చదివి వుండడం చాలా అవసరమని అందరంగీకరిస్తారు. ప్రభుత్వంకూడా మాటల్లో అంగీకరిస్తుంది, కాని క్రియలో శూన్యం—

విద్యాప్రచారం మాటలతో జరిగేదికాదు. ధనం వెచ్చించితేనేగాని విద్యాప్రచారం సాగదు. మన దేశంలో ఇప్పుడు ఆంగ్లవిద్య చదువుకోవాలంటే ధనవంతులకే అవకాశంగాని బీదలకు అవకాశంలేదు. ఆకారణంవల్ల ఆంగ్లవిద్య బీదలు చదువుకునే సావకాశం పోయింది. ఇప్పుడాంగ్ల భాష చదవాలనే మోజు, ఆశలు, కూడా అణగి పోయినయి. ఇక దేశభాషలలోనైనా ఊరక చదువుచెప్పే పాఠశాలలు బహు తక్కువ. అసలు మన ప్రభుత్వానికి, ప్రభుత్వాధికారులకు విద్యాభివృద్ధి కావడం యిష్టం లేకపోవడంవల్లనే విద్యావిషయంలో ధనంవద్ద తొంటిచేయి చూపిస్తున్నారు. ఇప్పుడు భారత దేశంలో చదువుకొన్న నూటికి పదిమంది అయినా విశేషంగా పట్టణాల్లో వున్నారు గాని పల్లెల్లోలేరు. కాబట్టి పల్లెటూళ్ళల్లో విద్యాశూన్యత మెండైనది. నిరక్షరకుక్షులతో నేటిపల్లెలు తాండవ మాడుతున్నాయి. విద్యా విహీనతవల్లనే పల్లెలు నేడు ఆరోగ్యాది సమస్త విషయాల్లో వెనకపడి కృశించి పోతున్నాయి.

విద్యాశూన్యులైన ప్రజలకు స్వాతంత్ర్యమనే విషయం బోధకావడమే చాలా కష్టం. విద్య ఏమాత్రమైనా వచ్చివుంటేనేగాని కొంత ప్రపంచ జ్ఞానంకలిగి వర్తించడానికి సావకాశంలేదు. ప్రాథమిక విద్య వరకైనా బాలురకు నిర్బంధంగా ప్రభుత్వం చెప్పించటానికి పూనుకుంటే, తర్వాత కొంతవరకు స్వయంకృషిమీద విద్యాభివృద్ధి చేసుకోవడానికి ఈకాలంలో సావకాశంవుంది. కొంచెం భాషాజ్ఞానం కలవారికి నేడు వార్తా

పత్రికలవల్ల చాలా భాషాభివృద్ధి కలుగుతోంది. మాతృభాషలో వార్తాపత్రిక లభివృద్ధి అయినతర్వాతనే మనదేశంలో విద్యా ప్రచారంకొంత జరగాటానికి మంచి అవకాశం ఏర్పడి జరిగి జరుగుతోంది. ప్రాథమికవిద్యవరకు నేర్చుకున్న వారికి భాషాభివృద్ధి చేసుకోవడానికి, దేశవిషయాలు అర్థంకావడానికి, మూడు ఆధారాలు నేను ఏర్పడ్డాయి.

౧. వార్తాపత్రికలు, ౨. ఉపన్యాసములు, 3. గ్రంథాలయములు.

ప్రాథమిక విద్యాజ్ఞానంగలవారు వార్తాపత్రికలవల్ల భాషాభివృద్ధి చేసుకోవచ్చు. ప్రముఖులైన పండితుల, శాస్త్రవేత్తల, ఉపన్యాసముల వల్ల వివిధదేశ విషయాలు గ్రహించవచ్చు. తర్వాత వివిధగ్రంథాలుండే గ్రంథాలయం వల్ల మరింత భాషాభివృద్ధిచేసుకొని దేశకాలముల చరిత్ర విజ్ఞానం సంపాదింపవచ్చును. గ్రంథాలయములు కల్పతరువులంటివి. ఏవిషయంలో అభిలాషగలవారు ఆసంబంధమైన గ్రంథాలుచదివి వారి విజ్ఞానాన్ని సర్వతోముఖంగా ఇనుమడింప చేసుకోవచ్చును. విద్యార్థులకు గ్రంథాలయాల వల్ల కలిగేలాభముగణింపరానిది. కొంతభాషా జ్ఞానంకలవారికే గ్రంథాలయాలవల్ల, పత్రికల వల్ల లాభంవుంది గాని నిరక్షరులకు ప్రయోజనం లేదు. కాబట్టిముఖ్యంగా ప్రభుత్వం విద్యా విషయంలో ఆదాయ వ్యయపట్టికలో ధనం హెచ్చుఖర్చుపెట్టడానికి పూనుకొని, నిర్బంధ ప్రాథమిక విద్యావిధానాన్ని చట్టరూపకంగా పెట్టి ఖండితంగా అమలుజరపాలి. అందుకు ప్రజాప్రతినిధులైన శాశనసభ్యులందరూ తీవ్రమైన కృషిచేయాలి. ప్రభుత్వానికి దేశానికి ఆధారభూతమైన పల్లెటూళ్లలో విద్యాభివృద్ధి కావటానికి ప్రభుత్వంపూనికపట్టాలి. ప్రజలు నాయకులు ఆందోళన చేయాలి. నేడనేకమంది ఆంగ్లపట్టభద్రులు నిరుద్యోగులై బస్తీలలో ఊరక కాలక్షేపము చేయుచున్నారు. అట్టివారందరు పల్లెలకువెళ్లి విద్యాప్రచారం, పత్రికా ప్రచారం, గ్రంథాలయోద్యమప్రచారం, చేస్తే బహుత్వరితకాలంలో పల్లెలలో విద్యాభివృద్ధి కాగలదు. తద్ద్వారా ఆరోగ్యాది సమస్తవిషయములలో పల్లెటూళ్లు బాగుపడును. భారతదేశం ఏనాటికైనా స్వాతంత్ర్యం పొందాలంటే పల్లెలు సర్వవిధాల ముందు బాగుపడాలి. పల్లెలు బాగుపడాలంటే నిర్బంధప్రాథమిక విద్యావిధానంచట్టరూపకంలోపెట్టి ప్రచండంగా అమలు జరిపితేనే గాని వీలులేదు. ఇందుకునాయకులు, పత్రికలు, సక్రమమైన ప్రచారంచేసి ప్రభుత్వదృష్టిని మార్చాలి.

తమస్వంతరాజ్యాలలో ప్రజలకు నిర్బంధంగా విద్యనేర్పుతున్న బ్రిటిష్‌ప్రభుత్వం తమచేతిక్రింద వున్న భారతదేశప్రజల్ని విద్యావంతులుగా చేయడం ముఖ్యమని గ్రహించి వివేకంతో నడవాలి. ప్రజల్ని విద్యావంతులుగా చేయాలని కోరుతూ విరమిస్తున్నాను.

---

# గ్రంథ పరిచయము

## ఆదర్శ సుఖజీవనము.

వెల : రూపాయి.

ఇయ్యది ఆంగ్లమున **An Ideal Happy Life** అని ఖుషీరామ్‌గారిచే వ్రాయబడి ఆంధ్ర విద్వల్లోకమునకు చిరపరిచితులగు కూచి నరసింహముగారిచే నాంధ్రీకరింపబడినది.

“పశుప్రాయుడు మొదలుకొని పరమహంసునివరకు నుండు నందఱును సుఖావాప్తియు దుఃఖనివృత్తియునే కోరుకొనుదు రనుట లోకవిదితము. అట్టి వాంఛ సిద్ధించుటకు సాధనభూతములైన విషయము లనేకములు సయుక్తికముగా సప్రమాణముగా అనుభవజ్ఞుడైన ఖుషీరామ్‌గారీగ్రంథములో చర్చించినారు. తన యుపదేశములకు పోషకముగా చక్కని చిన్నచిన్న చారిత్రకథలును మహనీయుల సూక్తులును అచ్చటచ్చట ఎత్తివ్రాసినారు.

“అన్నిదేశముల స్త్రీపురుషులకు, అన్నిమతములవారికి, అన్నివర్ణములవారికి, అన్నివయసులవారికి సరిపడి, సమాదరణీయములైన సత్యములు బోధించుట యీగ్రంథముయొక్క విశిష్టలక్షణము” అని ఖుషీరామ్‌గారి గ్రంథమునుగూర్చి నరసింహముగారు విజ్ఞాపనమున వ్రాసినారు. ఆయభిప్రాయము గ్రంథముయొక్క ప్రతిపుటయందును ప్రత్యక్ష మగుచున్నదనుటకంటె వేరభిప్రాయ మీయ నవసరములేదు.

కల్లోలయుతమై నానాకష్టముల కాకరమైయుండు నేటి నవనాగరక ప్రపంచమందు నిట్టి గ్రంథముయొక్క యావశ్యకత యెంతయునున్నది. మనయాంధ్రభాషలో నిట్టి గ్రంథముల సంఖ్య వ్రేళ్లమీఁద లెక్కింపవచ్చును.

ఈగ్రంథము ‘ఆరోగ్యము; విద్య, గ్రంథపఠనము; సంఘజీవనము; పని; ధనము; మనోనిగ్రహము; స్వస్వరూపజ్ఞానము; బ్రహ్మసాక్షాత్కారము; చేసిమఱచిచింతింపకుము’ అను తొమ్మిది యధ్యాయములు గలిగి 162 పేజీలు గలిగి బైండు చేయబడియున్నది.

వివేకానందోపన్యాసములు, తదితరోద్గ్రంథములు తెనిగించి, యాంధ్ర విద్వల్లోకమున చిరకాలము క్రిందటనే పేరుగడించుకొనిన యనువాదకుని యనువాద వైఖరినిగూర్చి పొగడుట యప్రస్తుతము. శైలి కడుంగడుసులభమై, సుబోధమై, బాలురుగూడ నర్థము జేసికొనుట కనువగునటుల జాను తెనుగున వ్రాయబడినది.

గ్రంథములు వలసినవారు ఈక్రిందివిలాసమునుండి తెప్పించుకొనవచ్చును.

ముద్దా విశ్వనాథంగారు, మేలుపాక, యలమంచిలిపోష్టు, విశాఖపట్నంజిల్లా.

---

## రష్యాదేశములో
## 50,000 సంచార గ్రంథాలయములు కలవు.

---

# ఏలూరు, హిందూ యువజనసంఘము.

**Youngmen's Hindu Association, Ellore.**

ఈ గ్రంథాలయము 1904 సం॥రము స్థాపించబడెను. 1918 సం॥రము॥ సంఘము రిజిష్టరు అయినది. 1928 సం॥రము మ॥రా॥శ్రీ రా॥బ॥ మోతే గంగరాజు జమీందారు ... యమున నూతన దివ్యభవనము (రు 50,000 లు వెచ్చింపబడి) నిర్మింపబడినది. ఇందు ... పత్రికలు, మాసపత్రికలు, ఆంగ్ల, ఆంధ్రభాషలయందు వచ్చుచున్నవి. ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత గ్రంథములు సుమారు 13 వేలవరకు గలవు. మ్యాజిక్ లాంతరు, వ్యాసరచన, పోటీపరీక్షలు, విషయనిర్ధారణ సభలు, వక్తృత్వపోటీపరీక్షలు ప్రతిసంవత్సరము జరుపుచు అందుత్తీర్ణులకు బహుమతు లొసంగబడుచున్నవి. ఇంకను గ్రంథములు, పత్రికలు, తెప్పించవలసి యున్నది. ఎలక్ట్రీసిటి, రేడియో అవసరము. ప్రతి సంవత్సరము ఆదాయమునకు మించిన వ్యయ మగుచున్నది. కాన ఎల్లరు శక్తికొలది సహాయపడుడు. ధర్మములకు రశీదులను శాశ్వత ధర్మములకు రశీదులతో పాటుపట్టాలను, 5 గురు శాశ్వతధర్మకర్తల (రు 500 దాతలు) సంతకములతో నిచ్చెదరు. క్యాటలాగులు అచ్చువేయబడెను. బజారులో బ్రాంచి లైబ్రరీ కూడ కలదు. ఇతర వివరములకు—

రావుబహద్దరు, మోతే గంగరాజు జమీందారుగారు, (ధర్మకర్తృసభాధ్యక్షులు)
మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు, (ధర్మకర్తృసభాగౌరవకార్యదర్శి)

## దివ్యజ్ఞానదీపిక.

వసంతా యింస్టిట్యూటు అడయారు వారిచే ప్రకటింపబడు మాసపత్రిక. వ్యక్తి అభివృద్ధికిని, సంఘాభివృద్ధికిని తోడ్పడు ఆర్థిక, మత, విద్యాసాంఘికాది విషయములు, ఇహపరవిషయములను బోధించు అందఱకు తెలియువిధమున వ్యాసములు, కథలు, వృత్తాంతములు, పద్యములు ప్రకటించును. సంవత్సరమునకు చందా రు. 1. మాత్రమే.

కావలసినవారు. 1 మేనేజరు, దివ్యజ్ఞానదీపిక ఆఫీసు.
వసంతా ఇన్‌స్టిట్యూటుఅడయారు.—లేక
పి వి. కామేశ్వరరావుగారు. ఎం.ఎ., బి.ఎల్., ఏలూరు.

## వైష్ణవపత్రిక.

ఇందు విశిష్టాద్వైత మతసిద్ధాంతములును, శ్రీవైష్ణవ ధర్మములును పూర్వాచార్యుల దివ్యచారిత్రములును, వారి ప్రబంధములకు ఆంధ్ర భాషాంతరీకరణములు ప్రతిపదటీకాతాత్పర్యములును, శ్రీవైష్ణవసంఘమునకు సంబంధించిన కాన్ఫరెన్సులు, సభలు, ఆర్మానములు, మొదలగు ననేకోపయుక్త విషయములు ప్రకటింపబడును.

సంవత్సరచందా 2-0-0 వి. పి. ఖర్చులువేఱు.
శ్రీవైష్ణవ పత్రికా కార్యాలయము.
కొంటపాడు, పశ్చిమగోదావరిజిల్లా.

## ప్రకటన

ఆంధ్రహోమియోపతిక్ జర్నల్, పిఠాపురం.
(స్థాపితం— 1934)

వైద్యము, ఆరోగ్యము, ఆహారము, రోగికుపచారము, శిశుసంరక్షణ మొదలగు అనేక విషయములును, అనుభవజ్ఞులచే ఇంగ్లీషుభాషలో వ్రాయబడిన గ్రంథములనుండియు, మాసపత్రికలనుండియు గ్రహించియిందు ప్రచురింపబడును. అమూల్యమైన యిట్టి పత్రిక ప్రతి యింట నుండదగినది. వైద్యులకు, వైద్యేతరులకు ఉపచరింపగలదు.

సం॥ చందా రు 2/లు ముందుగాపంపవలెను.
డా. మల్యాల శ్రీ మాధవరావు, బి.ఎ., ఎడిటర్.

## పట్టుశాలి.

పట్టుశాలిసంఘాభివృద్ధికై ప్రకటింపబడు జాతీయ మాసపత్రిక. సంవత్సర చందా రు 1-8-0
బొంతలకోడూరు, చికాకోల్.

# Gosamrakshanasamithi, Ellore.

## గోసంరక్షణసమితి, ఏలూరు,

ఈ సమితియందు దిక్కులేని గోవులు రక్షింపబడును. పాలు ఉన్నయెడల చంటి బిడ్డలకు దైవపూజలకు, బీదలకు ఉచితముగ నిచ్చెదరు. పచ్చగడ్డి నిమిత్తము బీడుభూమి కావలసియున్నది. మంచిస్థితిలోనికి వచ్చిన గోవులను గృహస్థులకు అమ్మెదరు. గోశాలనిమిత్తము స్థిరమైన స్థలము అవసరము. ధర్మములకు రశీదులు శాశ్వతనిధి ధర్మములకు రశీదులతో సహా అయిదుగురకు తక్కువగాని శాశ్వత ధర్మకర్తలు [రు 500 దాతలు] సంతకములతో పట్టాల నిచ్చెదరు. అభిమానులెల్లరు శక్తికొలది శాశ్వతనిధిధర్మము లేకాక వార్షిక మామూళ్లును, నెల చందాలుగను, వరిగడ్డి, తవుడు, విరాళములుగను సహాయపడి యీ సమితియభివృద్ధికి తోడ్పడ గోరుచున్నాము.

గోసంరక్షణసమితి ప్రచురణములకు, రూల్సుబుక్కులకు, రిపోర్టులు మున్నగువానికి:—

5—1—1935.
రా॥ బ॥ మోతే గంగరాజు జమీందారుగారు, (ప్రెసిడెంటు, ట్రస్టి.)
మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు, (వైస్ ప్రెసిడెంటు, ట్రస్టి.)

---

కవికొండల వెంకటరావు బి.ఏ, బి.ఎల్ గారి గ్రంథములు - తగ్గింపుధరలు.

| | | | |
|---|---|---|---|
| 1. మాతృదేశ సంకీర్తనము | 0-0-6 | 6. కలరుతము | 0-0-6 |
| 2. జనపదములు | 0-0-6 | 7. కోనేరు | 0-1-0 |
| 3. కుమార కంఠము | 0-0-6 | 8. పొట్టికత | 0-4-0 |
| 4. నదుపులదూత | 0-0-6 | 9. ఆత్మవ్యక్తి | 0-4-0 |
| 5. చిట్టికెత | 0-0-6 | 10. త్రయి | 0-8-0 |
| | | 11. ఆగడపలు | 0-4-0 |
| | | 12. జంటలు | 0-8-0 |

ఇవిఅన్నియు రెండురూపాయలకే ఇయ్యబడును.
వలయువారు గ్రంథకర్తగారి పేర
ఇన్నిసుపేట, రాజమండ్రికి వ్రాయవలెను.

ప్రతి గ్రంథాలయంలోనూ ఉండదగిన పుస్తకాలు.

| | |
|---|---|
| ప్రభవ — ఉత్సాహపూరితమైన ఖండకావ్యాలు | 0-8-0 |
| నందకుమారవధ — జాతీయభావప్రేరకమయినచరిత్ర | 0-8-0 |
| ఉత్కళపతనము — ఉద్రేకకరమయిన ఉన్నతాశయాలు గల నాటకం | 0-12-0 |
| మాతృపూజ — ప్రసిద్ధకవికుమారుల జాతీయగానం | 0-4-0 |
| వైశాఖి — సాటిలేని ప్రసిద్ధరచనలు | 1-0-0 |

కవితాసమితి : విశాఖపట్నం

---

అయ్యా,

నాచే రచియింపఁబడిన పుస్తకములలో 'శ్రీబమ్మెరపోతనామాత్యుఁడు' అనునది 1926 సంవత్సరమున మదరాసు విశ్వవిద్యాలయమువారి బి.ఎ. పరీక్షకును, 1937 సంవత్సరపు ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి బి.ఎ. ఆనర్సుపరీక్షకు నేర్పాటుకాఁబడిన గ్రంథములలో నొకటియైయున్నది. 'పుణ్యక్షేత్రములు' అను పుస్తకము దేశయాత్రఁజేయువారికి మిక్కిలి యుపయోగకారిగ నున్నది. 'అమెరికావర్తకచరిత్ర' వలన అమెరికావా రెటుల అత్యున్నతస్థితికి రాఁగలిగిరో తెలియఁగలదు. ప్రతిగ్రంథాలయమునందు పైపుస్తకము లుంచఁదగినవైయున్నవి.

శ్రీబమ్మెరపోతనామాత్యుఁడు 1-0-0, పుణ్యక్షేత్రములు 0-4-0, అమెరికావర్తకచరిత్ర 0-4-0.
పైపుస్తకములు గ్రంథాలయములకు 1-4-0 లకు ఇయ్యఁబడును.

కావలసినవారు:—

శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారికి బెజవాడకు వ్రాయవలెను.
కొలఁదిప్రతులుమాత్రమే కలవు.

పెద్దిభొట్ల వీరయ్య, బి. ఏ., బి. ఎల్., బెజవాడ.



అపూర్వతరుణము.

అమూల్యగ్రంథములు! ఉచితము!!

| | |
|---|---|
| భరతదేశవిషయములు | 0- 4-0 |
| తిలకుమహాశయుని జీవితచరిత్ర | 1- 0-0 |
| శ్రీమద్రామాయణసారము | 0- 6-0 |
| భారతయోధులు | 0- 6-0 |
| జడకుచ్చులు | 0- 8-0 |
| వేదకాలనిర్ణయము ఫుల్ కాలికో బైండు | 0-12-0 |
| గణకతరంగిణి (సిద్ధాంతులచరిత్ర) | 0- 8-0 |

## గ్రంథాలయ సర్వస్వమునకు చందాదారులుగా జేరువారికి మాత్రము

రు3-0-0లు ఖరీదుగల పుస్తకములు ఉచితముగా పంపబడును. పోస్టేజి ప్రత్యేకము.

*For copies apply to:—*

**A. G. Press, Bezwada.**



# ప్రకృతి

ఆరోగ్య సచిత్ర మాసపత్రిక.

ఆరోగ్యనియమములను - మందు, శస్త్రములతో నిమిత్తములేని స్వాభావిక చికిత్సా విధానములను, స్వాభావిక జీవనమును బోధించును. సంవత్సరచందా రు 3-0-0

మేనేజరు:

ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

## "విజయ" సచిత్రమాసపత్రిక.

సం॥ చందా రూ 1. విడిసంచిక 0-1-6.

హాస్యరసోపేతము విజ్ఞాన సర్వస్వము. ఒకచరిత్ర - ఒకరసము - ఒకపరిశ్రమ ఒక పరిశోధన - ప్రకటించినది ప్రకటించకుండా ప్రకటించేది "విజయ" ఒక్కటే. సంచికంతయు సచిత్రమే. ప్రతివిలేఖరియు సుప్రసిద్ధుడే. మిమ్ముల్ని నవరసతరంగిణిలో ముంచెత్తుతుంది. ఇన్నివిషయములు చర్చించు పత్రిక యింత స్వల్పమూల్యమునకు చిక్కదు.

వివరములకు:—విజయ కార్యాలయము, విజయనగరం.

## హిందూసుందరి

ఇది కాకినాడ విద్యార్థినీ సమాజము (రిజిస్టర్డు) తరఫున ప్రతినెల వెలువడు మాసపత్రిక. దేశమందు— ముఖ్యముగా విద్యావిషయములో నితరదేశములకంటె మిక్కిలి వెనుకబడియున్న మహిళామణులకు విద్య ప్రబోధింపజేయుటయే యీపత్రికయొక్క ముఖ్యోద్దేశము. ఇది 29 సం॥నుండి ఆంధ్రమండలమందేగాక రాష్ట్రేతరాంధ్రులకును విశేష ప్రచార మొనర్చుచున్నది. విద్యాసంస్థలను గూర్చిన వ్యాసములు, మనోరంజకములగు వివిధ పద్యగద్యవ్యాసములు, చక్కని కథలు భక్తి, నీతి, సత్ప్రవర్తనాది సదభ్యాసములు ప్రబోధించు విషయములు, ముఖ్యముగ స్త్రీలకు, బాలికలకు నిత్యోపయోగకరములగు పాకశాస్త్రము, ఇతర కళలు నేర్చుపాఠములు, నాటకములు, మహాత్ముల చరిత్రలు, మున్నగు ననేకవిషయములు ప్రచురింపబడుచుండును. సం॥ చందా రు ౨ మాత్రము.

కలయువారు: మేనేజరు, హిందూసుందరి, కాకినాడ.

## ఉదయిని సాహిత్యపత్రిక.

సం॥చందా రూ 4.

సంపాదకుడు:

కొంపెల్ల జనార్దనరావు.

'ఉదయిని' లో చక్కని కావ్యాలు, కథలు, నాటకాలు, హాస్యాలు, విమర్శవ్యాసాలు— అందమైనవీ, ఉత్కృష్టమైనవీ రచనలు ప్రకటితమవుతాయి.

'ఉదయిని'వంటి పత్రిక తెలుగులో మరొకటి లేదన్నారు చదువుకొన్న రసజ్ఞులు.

కార్యాలయం: 15 అరవప్పు ముదలివీధి, తే.పేట, మద్రాసు.

# గ్రంథాలయ సర్వస్వము.

చందా: ఆంధ్రదేశగ్రంథాలయసంఘసభ్యులకు సభ్యత్వచందాలో రు 3 లు మాత్రమే.
ప్రతినెల ౧-వ తేదీన వెలువడును.

## వ్యాసములు

గ్రంథాలయ శాస్త్రము-ఆంధ్రవాఙ్మయము-ఆంధ్రాభ్యుదయములను గూర్చిన అనుభవ పూర్వకములైన వ్యాసములు, గ్రంథాలయ సంఘములయొక్క నివేదికలు, వృత్తాంతములు, గ్రంథముల విమర్శనములు ఇందు ప్రకటించబడును.

## పటములు

గ్రంథాలయ భవనములయొక్కయు, గ్రంథాలయ సభలయొక్కయు, గ్రంథాలయ సేవకులయొక్కయు, పటములును, ఆంధ్రాభ్యుదయ బోధకములగునట్టి పటములును ఇందు ముద్రింపబడును.

## గమనింపుడు

ఈ పత్రిక ప్రతినెల ౧-వ తేదీన వెలువడును. కావున వ్యాసములను పంపువారు ఏనెల పత్రికయందు ప్రకటింపవలెనో దానికి వెనుకటినెల 15-వ తేదీకి పూర్వమే పంపవలయును. పటములను వెనుకటినెల 1-వ తేదీకి పూర్వమే పంపవలయును.

## ప్రకటన రేట్లు

| | |
|---|---|
| ఒకసారి 1 పుటకు | రు 20-0-0 |
| ఒకసారి $\frac{1}{2}$ పుటకు | రు 12-0-0 |
| ఒకసారి $\frac{1}{4}$ పుటకు | రు 6-0-0 |

రాజపోషకులు :— శ్రీరాజా వేంకట కుమారమహీపతిసూర్యారావు బహద్దరుగారు,
శ్రీరాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారు, మద్దుల వేంకట చినరాజు శ్రేష్ఠిగారు, ఏలూరు.
బెల్లంకొండ రాఘవరావుగారు, అగ్రహారందారు గోపు రామచంద్రరావుగారు, బెజవాడ.

వివరములకు:—గ్రంథాలయసర్వస్వకార్యస్థానము, బెజవాడ.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు కుందా లక్ష్మీనరసయ్యగారిచే ముద్రింపబడినది.